

# జయంతజయపాలం



గ్రంథకర్త:

ఆకెళ్ల సత్యనారాయణరావుగారు



ప్రకాశకులు

సరస్వతీ బుక్ డిపో,

బెజవాడ

# మా స్వంత ప్రచురణములు

## నాటకరాజములు

ఇచ్ఛాపురపు యజ్ఞనారాయణశాస్త్రిగారి

| | | |
|---|---|---|
| రసపుత్ర విజయము | .... | 1—2—0 |
| రాణాప్రతాపసింగ్ | .... | 1—0—0 |

డాక్టర్ వంగూరి శివరావుగారి

| | | |
|---|---|---|
| చంద్రగుప్త | .... | 1—4—0 |

సోమగంటి లక్ష్మీనరసింహారావుగారి

| | | |
|---|---|---|
| పాదుకాపట్టాభిషేకము | .... | 1—12—0 |
| విప్రనారాయణ | .... | 1—8—0 |
| రాధాకృష్ణ | .... | 0—12—0 |

ముత్తనేని వేంకటపన్నకేశవులుగారి

| | | |
|---|---|---|
| చండిక | .... | 1—8—0 |

సూరి పార్థసారధిశర్మగారి

| | | |
|---|---|---|
| రంగూన్ మెయిల్ | .... | 1—4—0 |

వలయువారిట్లు వ్రాయవలయును :

కురుకూరి సుబ్బారావు సన్స్,

ప్రొప్రయిటరు :

**సరస్వతీ బుక్ డిపో, బెజవాడ.**

# జయంత జయపాలము

(నవరసభరితమగు 5 అంకముల నాటకము)

గ్రంథకర్త:

జయదేవ సత్యనారాయణరావు నాటకములను రచించిన,

ఆకెళ్ల సత్యనారాయణగారు

ప్రకటనకర్త:

కురుకూరి సుబ్బారావు సన్

కురుకూరి స్వరాజ్య వెంకట సత్యనారాయణరావు

సరస్వతీ బుక్ డిపో,

బెజవాడ, కృష్ణాజిల్లా

ఐదవ కూర్పు 250

శ్రీ సరస్వతీ ప్రెస్, బెజవాడయందు ముద్రింపబడెను.

1946



వెల 0—12—0] [పోస్టేజి ప్రత్యేకము.

0·4—0

1—0—0

# రంగూన్ రౌడీ

## (అను)

# పతిభక్తి నాటకము

(గ్రంథకర్త: సోమరాజు రామానుజరావుగారు.)

పల్లెలలో రౌడీ—పట్టణములలో రౌడీ—వీథులలో రౌడీ—విపణికలలో రౌడీ—సంతలలో రౌడీ—చావిళ్ళలో రౌడీ—సందులలో రౌడీ—సభలలో రౌడీ—గుళ్ళలో రౌడీ—గృహములలో రౌడీ—కక్షలలో రౌడీ—కలహములలో రౌడీ—కోర్టులలో రౌడీ—పార్టీలలో రౌడీ—దొంగలలో రౌడీ—దొరలలో రౌడీ—హత్యలలో రౌడీ—నృత్యసభలలో రౌడీ—సొగసులలో రౌడీ—సరసములలో రౌడీ—ఈరౌడీలలో మనరౌడీయెవ్వరు?

**మనరంగూన్ రౌడీ** సర్వసద్గుణాలంకారుడు—సమస్తజనభయంకరుడు! మొదటిదెబ్బతో రంగారావుకు మోక్షమిచ్చినరౌడీ! పోలీసువారికి చిక్కకుండ పొగయోడ నెక్కినరవుడీ—సముద్రమధ్యమున—మొసలిపట్టినను—చావనిరవుడీ—రక్షించినదమేశ సంపతులతో రంగూను చేరినరవుడీ—అన్నముపెట్టినదాతకు సున్నముపెట్టినరౌడీ—ప్రాణదాత భార్యతో ప్రణయప్రసంగములాడించిన రవుడీ—రమేశునిచంపి యాతని భార్యతో రంగూనువిడిచినరవుడీ—చెడత్రాగి ప్రభావతిచేతికి చిప్పయిచ్చినరవుడి—బంధింపవచ్చినమామకు ప్రాణమోక్షమిచ్చినరవుడీ—తనయపరాధములన్నిటికిని తలపై బడుకొనిభార్యను గాంచి పశ్చాత్తాపముపాలైనరవుడీ—ఘోరమరణశిక్షకు పాల్పడి సద్భార్యకొరకై గుండెబ్రద్దలైనరవుడీ—మనరంగూనురవుడీ అన్నిరసములలోనున్నాడు. అన్నియనుభవములలోనున్నాడు. అన్ని అంకములలోనున్నాడు!—మహాద్భుతముగల్గించినరవుడీ చదువరుల గుండెలను దడదడలాడించినాడు! పకపకనవ్వించినాడు—బొటబొట కన్నీరుగార్పించినాడు!—శృంగారచేష్టలతో సుఖానుభవము నొందించినాడు!

ఆంధ్రదేశమునందలి అన్నిపట్టణములవారికిని ఆనందముగ గల్గించి యెప్పుడు ప్రకటితమగునాయని యెదురుచూచుచున్న రంగూన్ రవుడీ నేటికి ముద్రింపబడి సిద్ధముగనున్నది!—రసభరితములగు పద్యములు!—రమ్యములగుపాటలు, తప్పక యుంచుకొనిన హంతకులయొక్కగాని దొంగలయొక్కగాని మోసగాండ్రయొక్కగాని లేకుండ కాపాడగల మారంగూన్ రవుడీ! 1 రూపాయికి మాత్రమే లభింపగలదు.

వలయువారు:—గురుకూరి సుబ్బారావుసన్.

సరస్వతీ బుక్ డిపో, బెజవాడ. (కృష్ణాజిల్లా.)

# ఇందలి పాత్రలు

—♦ పురుషులు ♦—

(1) జయపాలుఁడు—మధురాపుర రాజకుమారుఁడు
(2) జయంతుఁడు— ,, మంత్రికుమారుడు
(3) సుదర్శనుఁడు— ,, రాజు.
(4) కళానందుఁడు—సుదర్శనుని మంత్రి
(5) చంద్రశేఖరుఁడు— ,, కుమారుడు
(6) వనపాలుఁడు.
(7) ఇద్దఱు ద్వారపాలకులు.
(8) కిరటకుఁడు—మేదరికులమునకు పెద్ద.

—♦ స్త్రీలు ♦—

(9) పంకజాక్షి—ఒక వేశ్య.
(10) భానుమతి—జయంతుని భార్య; సాధ్వి.
(11) కాత్యాయని—ఒక యోగిని.
(12) భువనసుందరి—జయపాలుని భార్య; జారిణి.
(13) రంగనాచి—భువనసుందరి దాసి.
(14) కాళి—ఒక దేవత.

---

# పీఠిక

ఈశ్వరానుగ్రహంబునను, ఆంధ్రనాటకాభిలాషుల ఆదరమునను, ఈకృతికన్యకకు నాల్గవసారి ఆంధ్రలోకయాత్రచేయు మహాభాగ్యమిప్పటికి సంప్రాప్తమయ్యె.

ఈనాటక ప్రతులన్నియును, సుమారు రెండుసంవత్సరముల క్రిందటనే చెల్లిపోయినను, కొందఱు మాటనిలకడలేని మహానుభావులు సాయముచేసెదమని, వాగ్దానముచేసి, కేవలమూపనుచు, నేటి వఱకు కాలయాపన చేయుచుండుటచే, ఇది వెలువడుట కాలస్యమయినది.

నామిత్రుఁడును, బెజవాడ సరస్వతీబుక్ డిపో ప్రొప్రయిటరును నగు శ్రీయుత మరుకూరి సుబ్బారావుగారు ప్రకటించెదనని, కోరినందున వారివలన తగు ప్రతిఫలమును పొంది, యీనాల్గవకూర్పునుండియు, ఈగ్రంధముయొక్క కాపీరైటు హక్కులును మఱియు నితర సర్వహక్కులును, పుత్రపారంపర్యముగా ననుభవించుటకై వారికొసంగితిని. ఇంతటినుండియు పాఠకుల కాశాభంగము గలుగకుండ వారే ప్రచురింతురుగావున సర్వేశ్వరుడు వారికాయురారోగ్యైశ్వర్యములఁ బ్రసాదించునుగాక యని వేడుచున్నాను.

ఇట్లు,

విశాఖపట్టణము
10—3—31.

☞ ఆకెళ్ళ సత్యనారాయణ,
గ్రంథకర్త.

# జయంతజయపాలము

## నాంది

శ్రీకాంతాహృదయాబ్జరంజక మహా
శృంగార మార్తాండుఁ డ
స్తోకప్రాభవుఁ డవ్యయుం డమలసం
తోషాంతరంగుండు సు
శ్లోకుం డాశ్రితవారకల్పనగజి
ష్ణుండైన విష్ణుండు దా
సాకల్యంబగు ప్రేమతోఁ గనుత మ
శ్రాంతంబు మిమ్మున్ మమున్.

కన్నడ — చాపు.

కరుణాకరా! పరా! - కరుణ మమ్మేలుమా!
నిరామయా! నిన్నే - నెమ్మదిని నమ్మినాము॥ కరు॥
దారితప్పి యున్నారము - భారము నీపై వేసినాము।
ఏరీతి మమ్ముల మంచి - దారిఁ జేర్చెదవో దేవా!॥ కరు॥
పరుల నిందాస్తోత్రముల్ - పాటింప కుండుబుద్ధి।
మఱియు ఇతర సద్గుణములు - మాకలవడఁజేయవే॥ కరు॥
ఆ కెల్ల సత్యనారా - యణ సుతా! శుభచరితా!
శ్రీకళార్థి సంఘపాలా! - నీకృపాబ్ధిఁ దేల్పవె మము॥ కరు॥

చ॥ వరగుణులాప్త మిత్రులు ♦ వైరమ దెట్లొకసాని పెట్టెనో
గరితలఁ బుట్టినిండ్ల బహు ♦ కాలము వీడిన నేమి నష్టమో
పరమహితోత్తముం డెటుల ♦ వర్తిలుచుండు నో తెల్పుగాథతోఁ
బరఁగెడు శ్రీజయంతజయ ♦ పాలము లోకహితంబు గావుతన్.

# జయంత జయపాలము

## ప్రథమాంకము

### ప్రథమరంగము—రాజమార్గము.

[పంకజాక్షియను సాని ప్రవేశించును]

పంక—[సంతోషముతో] బళే! ఇన్నాళ్ళకు నా చమత్కార వాఙ్నిపుణతయు, నా మాయోపాయ మహాకౌశలంబును చూప వలసిన తరుణము సంప్రాప్తమైనది. రాజకుమారుండును మంత్రికుమారుండును చిన్నతనంబునుండియు అవిచ్ఛిన్న స్నేహ పాశబద్ధులై సంచరించుచున్నారు. అందు రాజకుమారుండు రాజ్యకార్యంబులం గన్నెత్తి చూడక, జవ్వనియగు భార్యతోను తలపెట్టక కాలము వ్యర్థపుచ్చుచున్నాఁడు అనుచు రాజు చింతించి వారినిరువురను విడఁదీయ చతురోపాయంబులను ప్రయత్నించి విఫలమనోరథుండయ్యెనఁట! మంచిపనియైనది. ఎవ్వరేపని చేయదగినవారో వారాపని చేసిన రాణించును; కాని యితరులు పూనుకొనిన తలవంపులు కాకమానునా? రాజునేర్చిన చతురోపాయంబులు శాత్రవులయెడఁ పనికి వచ్చును; కాని మిత్రులకడ సాగునా? మిత్రభేదము పంచ తంత్రములందొకటి. ఆతంత్రము బాగుగ ఎఱింగినవారంగనలు. అందు ముఖ్యముగా పేరొందినవారు వారాంగనలు. ఆలుమగలను, తండ్రికొడుకులను, అన్నదమ్ములను, ప్రాణ మిత్రులను, క్షణములో వేరుచేసి గర్భశత్రులుగ చేయుట

సానుల కగ్గుఁబాల రంగరించిపోసిన కులవిద్య. కాన వేశ్యాకులంబున పుట్టిన నే నాజయంతజయపాలుర విడఁదీయుటెంతపని? రాజుగారు నన్ను పిలిపించి వారిద్దఱకును కయ్యము పెట్టి వేరుజేసిన వేనూటపదునార్లు కట్నమిచ్చెద మన్నారు. కనుక, కడుజాగ్రత్తతో ఆపని చేసివచ్చెద. (కొంచెము దూరమునడచి నిలిచి) మిత్రుల విడఁదీయుట బహుదోషము కాఁబట్టి నాఅంతరాత్మ, "వద్దువద్దు"ని వెక్కుచు లాగుచున్నది కాని వేనూటపదునార్లెంత కష్టబడిన వచ్చును? ఎంతకాలము పట్టును? ఇప్పుడో అనాయాసంబుగ ఒకగడియలో దొరకవచ్చును. అదియునుగాక నేను చేయుపని ఒకవిధముగా మంచిది. ఎట్లన రాజసుతుండు రాజ్యకార్యంబుల ముట్టకున్న ఇప్పుడిబ్బంది లేదు; కాని, యుక్తవయసువచ్చిన భార్యను పుట్టిట ఉంచివేయుట గొప్పతప్పు. దాన పెక్కనర్థంబులు కలుగుటయే కాక ఒకప్పుడు ప్రాణహాని కూడ సంభవించును. గాన,

హిందూస్థాని క్యాల్ — ఆది.

ఇప్పుడే పోయి ఆ - యిద్దఱ నెడఁబాపెద;
తప్పక భూపాలుని - మెప్పు లంది వచ్చెద|| ఇప్పు||
ఇట్టిపనులను చేయ - ఏ మాటికేటినాము|
ఎట్టి దిట్టరి నైన మేము - బుట్టలో వేయఁగల|| మిప్పు||
ఆఁడుది పూనుకొనిన - మూఁడులోకంబు లులుకు||
లీలగ ముట్టడింపఁ - జాల సముద్రాలు|| ఇప్పు

## ద్వితీయరంగము — ఉద్యానవనము

(మంత్రికుమారుడగు జయంతుడు ప్రవేశించును.)

జయం — కాంభోది - రూపకము.

నిక్కపున్నెహితుండు - చిక్కుట దుర్లభము
ఒక్కడైన నూటికి - ఉండు టతి ష్టము॥ నిక్క॥
పని యేదేని యున్నచో - పల్కుచు కడుతియ్యగా
దినము వత్తు రింటికి - పనితీరనంత దాక॥ నిక్క॥
పరిచయము గ్రావారెల్ల - వయస్యులు కానేరరు!
పరిచయమైనంతలను - కరము భేద మున్నది॥ నిక్క॥
మిత్రుని బోలు మిత్రుని - ధాత్రి నొక్కని గాంచితి!
మిత్రపదమణి దాల్ప - పాత్రుడు జయపాలుడు॥ నిక్క॥

ఎవడురా అక్కడ ?

వనపా—(ఎదురువచ్చి చేతులుజోడించి) బాబూ! ఏమిసెలవు?

జయం—జయపాలుడు వచ్చినాడా?

వనపా—వచ్చెదనని కబురంపినారు. కాని యింకను రాలేదు.

జయం—సరే, (లోనికిపోయి ఒకచోగూర్చుండి) మిత్రుడింతవఱకు రాకుండుటకు హేతు వేదేని యుండవలెను.

గీ॥ అతని, రాజంపెనేమొ కా ♦ ర్యార్థ మెచటి
కైన; తండ్రి పని చిక్కె ది ♦ యైన వచ్చె
నేమొ! నను జిల్వ మాయింటి ♦ కేగెనేమొ!
ఎదుట కన్నదురుచు నున్న ♦ దిప్పు డకట!

తండ్రి తన్నెక్కడకైన అంపిన నాతో చెప్పకుండ పోవునా? వచ్చి చెప్పుటకు వ్యవధి లేకున్న సేవకునిచేతనైన కబురంపకుండునా? ఏదేని కష్టమువచ్చిన ఈపాటికి ఊరెల్ల అల్లుకొనదా? దైవానుగ్రహంబున నాచెలికాని కట్టిదొసగుము పొసగకుండుగాక! (యోచించి) అతడు తన జనకునితో మాట్లాడుచుండవలె; లేనా నాకో

అను మాయింటికి వెళ్ళియుండవలె. అహో! జయపాలునకు నాయందుఁగల సుహృద్భావ మగణ్యముకదా! భూరిసామ్రాజ్య వైభవోపేతుండయ్యు గర్వము రవ్వంతయు లేక, తన తండ్రిసేవకుని కుమారుండనని నన్ను నిరసింపక, తన అన్నవలెనే ఎంచుచునామాట యందు గౌరవముచూపుచు, ఎంతరహస్యమైన నాచెవిని వేయకుండ ఉండలేఁడుగదా!

సీ॥ కష్టకాలంబున ♦ కంటికి ఱెప్పరీ
తిఁ గాచువాఁడు స ♦ న్మిత్రుఁడు కాఁడె?
బంధువు లందఱుఁ ♦ బాఱఁదోలిన చేరఁ
దీసెడు వాఁడు స ♦ న్మిత్రుఁడు కాఁడె?
మనసున మాటల ♦ పనుల భేదము లేక
ఎపుడుండు వాఁడు స ♦ న్మిత్రుఁడు కాఁడె?
అవసర మైనచో ♦ ప్రాణమీయఁగ వెను
దీయనివాఁడు స ♦ న్మిత్రుఁడు కాఁడె?
ఎపుడు మేల్గోరువాఁడు స ♦ న్మిత్రుఁడు కాఁడె?
ఇట్టి నిరుపమగుణములు ♦ దొట్టికొలుకు
స్నేహితుం డెల్లవారికి ♦ చిక్కఁ డరిది;
కాని నాభాగ్యవశమున ♦ కల్గెనాకు.

జయ—(ప్రవేశించి, తనలో)]

మోహన — ఆటతాళము.

కమలములను రాత్రిరాఁ-గనే విడుచు రవి మిత్రుఁడా?
సమయమునకు పనికిరాని-సఖుఁడుండనేల? కాల్వనా॥ కమ॥
చెలికాఁడికెపు డేదైన- కొదువ వచ్చునప్పుడు
చలచల్లఁగ జాఱిపోవు-స్వార్థపరుఁడు హితుఁడా॥ కమ॥
భుజము భుజము కలిపితిరుగు- కుజనులెల్ల స్నేహితులా?
నిజముగ ఆజయంతుఁడే- నేస్త మనఁ దగినవాఁడు॥ కమ॥

జయంతుఁ డొకగడియ కనఁబడకున్న నామనసు వలలో చిక్కిన చేపవలె కొట్టుకొనుచుండును. భోజనసమయాంబులందుతప్ప తక్కినకాలంబులందు దిమ్మరము రామఃఫ్మణ వలె ఎడఁబాయకుండును. పాపము! అతని మామగారు వచ్చి ఎన్నిసార్లు పిలిచినను, లేనిపోని వంకలు కల్పించి, "రేపువచ్చెద, మాపువచ్చెద," నని కాలము పుచ్చుచున్నాఁడే. కాని యుక్తవయస్సునచ్చిన సతినిచూచుట కొకసారైన వెళ్ళలేదు. అందుకు కారణమతఁడు నన్నువిడిచి ఉండలేకం టేకదా! సెబాస్! అమూల్యమిత్రపదరత్నమును ధరింపఁదగినవాఁడు గుణవంతుఁడగు జయంతుఁడే

చ॥ ధనముగలానియింటికడఁ దప్పక కాకులరీతి నెందఱో
దినము నుచేరుచుందురు; కడుతియ్యగ పల్కుచుందు రుద్స్తోత్రము లొ
ఘనముగ చేయుచుందురు; మఱికష్టమువచ్చిన కాసు గాల్లి పో
యిన ముఖమింతచూపరు సరేకదా పిల్చిన పల్కఁ డొక్కఁడున్.

మఱియు అవసరమున్నప్పుడును, సొమ్ము విచ్చలవిడిగా కర్చుపెట్టుచున్నప్పుడును, అహోరాత్రములు నీడవలె వెంటనంటియుండు చెలికాండ్రు, వారి అవసరము తీఱినవెనుకను, డబ్బు కర్చుపెట్టుట మానినప్పుడును. చల్లఁగ జాఱిపోవుటయేకాక శత్రులయ్యెదరు, అట్టి కృతఘ్నుల, అధమాధములు, మిత్రద్రోహులను పట్టికట్టి, కాలములోని నగముచంపి నక్కలకప్పఁజెప్పినను పాపము లేదుగదా! కాని దైవానుగ్రహంబున ఎట్టి సుగుణంబులు గలవాఁడు మిత్రుఁడనఁదగినవాఁడో అట్టి సుగుణవంతుఁడు జయంతుఁడు నాకు లభించినాఁడు. అతఁడు నాకంటె ముందుగనే యిచ్చటికివచ్చి నాకొఱకెదురు చూచుచున్నాఁడు కాఁబోలు? ఎచటఁ డక్కడ?

వనపా—[వంగినమస్కరించి] యువరాజచంద్రా! ఏమనుజ్ఞ?

జయ—జయంతుఁడు వచ్చినాఁడా?

వనపా—చిత్తము, వచ్చియున్నారు.

జయ—ఎంతసేపైనది?

వనపా—సుమారు అరగడియ కావచ్చును.

జయ—సరే నీవని చూచుకొనుము (ముందుకుపోవును)

వనపా—చిత్తము (నమస్కరించిపోవును.)

జయం—(తనలో నాయెడమకన్నియుద్యానవనమునకు వచ్చినప్పటి నుండియు కొట్టుకొనుచున్నది. ఏమిచెడుగు కానున్నదో తెలియదు. కానిమ్ము కానున్నది కాకపోదు.

జయా—మిత్రమా! జయంతా! (దగ్గఱకుపోవును.)

జయం—అహో! జయపాలా! వచ్చినావా? (కౌఁగలించుకొని) నేఁడేల ఇంత జాగుచేసితివి?

జయ—మానాన్నగారితో మాటలాడుచుండుటచే కొంచె మాలస్యమైనది క్షమింపుము.

జయం—సరిసరి క్షమించుటకేమితప్పుచేసితివి? నేనెన్నిసార్లు ఆలస్యముగా రాలేదు? కాని మఱేమి వింతలు?

జయ—నీకు తెలియని వింతలేమున్నవి? నాకు పట్టాభిషేకము చేసి పిమ్మట వానప్రస్థాశ్రమంబును స్వీకరింప నిశ్చయించినట్లు మా నాన్నగారు చెప్పినారు

జయం—అందుకు నీవేమనినావు? ఒప్పుకొనినావా లేదా?

జయ—"ఇంక కొంతకాలము నన్నిట్లు స్వేచ్ఛగా తిరుగనిండ" ని ప్రార్థించి వచ్చితిని.

జయం—చా! చా! ఎంతపొరపాటు చేసినావు!

ఉ॥ ఎన్నఁడు రాజ్యతంత్రములనెల్ల యథావిధిసంగ్రహించెదో?
ఎన్నఁడు నీదు ఖడ్గమున నిప్పగుయాచవన కాంతిదోఁచునో?
ఎన్నఁడు నీతిఁ బ్రోచెద? వెన్నఁడు శాంతినొసంగెదో యంటం
చెన్నుచునుండ నీజనకుఁడిట్టుల పల్కుటకోర్తువా? సఖా!.

జయ—చెలికాఁడా! రాజ్యభారము పైబడనంతవఱకే యీవినోదములు ఈసుఖంబులు గాని అది పైఁబడిన పిమ్మట మనమిద్దర

మీగతి హాయిగా ముచ్చటించుటను వీలుండదుగదా!

జయం—ఏమట్లనుచున్నావు? నీవు రాజువైన నన్ను నీకగ్గలము రానీయవు కాబోలు? బాల్యస్నేహితుండవగు నన్ను మఱచిపోయెదవు కాబోలు!

జయ—(కౌఁగిలించుకొని) ఎంతమాటాడినావు! నేను రాజనైనప్పుడు నీవు మంత్రివి కాకుందువా? ఒకవేళ నారాజ్యాధిపత్యమే మనస్నేహంబున కడ్డువచ్చిన దానిని తృణప్రాయంబుగా ఎంచి విడిచిపెట్టెదనని నమ్ముము

జయం—అట్లైన—నీకీజంకెందుకు? శీఘ్రముగా రాజ్యాభిషిక్తుండవు కమ్ము.

జయ—ఓయీ! రాజరాజని పేరుగొప్పేకాని వానికుండు మనోవ్యాకులత వేఱొక్కని కుండదు సుమీ.

మ॥ తనసౌఖ్యంబులు లెక్కసేయక సదాధర్మం బుపాసించుచున్
జనకష్టంబులు పాపుచుం డి. వ్యసనాసక్తుండు కాకుండ వే
కనులన్ రాజ్యము నేలుచున్, రిపులదోర్గర్వంబు చెండాడుచున్
జనులున్ దైవము మెచ్చునట్లు నడువన్ సౌలభ్యమా మిత్రమా!

పంక—(ప్రవేశించి, తనలో) ఇంతసేపటికి నాగమ్య స్థానము చేరితిని. కాన నేను వచ్చినకార్యమిఁక అతిజాగ్రత్తతో చేయవలయు. పండగునో కాయగునో తెలియదు. ఎటులైనను నాప్రయత్నముమాత్రము మానను. ఒకవేళ నా పాచిక పాఱియుపుడు వారిద్దఱు దెబ్బలాడుకొనినను మరల ఎన్నటికైన కలిసికొనకమానరు. అపుడు మరిస్నేహము మఱింత దృఢపడును. కానిమ్ము ఆగొడవనాకేల? రాజకుమారుండున్నాడో లేడో తెలియలేదు. తినఁబోవుచు రుచి అడుగనేల? వెళ్ళి చూచెద. (ముందుకు వచ్చుచుండును.)

వనపా—నిలు నిలు. ఎవరావచ్చుచున్నది? (ఎదురువెళ్ళి) ఎవరునీవు ఇందు రాఁబనియేమి?

వంక—నేను వారకాంతను. యువరాజదర్శనార్థ మిచ్చటికి వచ్చితిని

వనపా—ఏమి? వారకాంతవా? ఏవారకాంతవు?

వంక—ఏవారకాంతనో నీకు తెలియదా?

వనపా—ఏ వారకాంతవో నేనేమెఱుగుదు? ఏడువారములున్నవి. అందులో సోమవారకాంతవో మంగళవారకాంతవో శనివార కాంతవో నాకేమి తెలియును?

వంక—చాలుచాలు. ఇంత తెలివిగలవాడవని అనుకొనలేదు నేను సానిని.

వనపా—(నవ్వుచు) సానివా? అలాగుచెప్పు. మొదటనే తేటమాట గాఁజెప్పరాదా? ఈపాడుగీర్వాణమెందుకు? సరే చెప్పివచ్చెద ఇచ్చటనేఉండుము. (వచ్చి) యువరాజా! తమదర్శనార్థము సానివచ్చి బైట తమయాజ్ఞకై వేచియున్నది. ఏమిసెలవు?

జయ—ఏమి? సాని వచ్చినదా? ఎవరికొఱకు?

వనపా—చిత్తము తమకొఱకే

జయం—(నవ్వుచు) మిత్రమా! ఇవ్వాళ్ళకు దొరకినావు. కానిమ్ము కానిమ్ము.

జయ—(వనపాలునితో) ఛీ! మూర్ఖా! తిన్నఁగా తెలుసుకొనిరమ్ము పొమ్ము.

వనపా—చిత్తము (పోవును.)

జయం—నాతో చెప్పినావు కావు. పోనిమ్ము క్రొత్తచెలుల సంపాదించుచున్నావా? సరే, నేనెందుకిక్కడ? పోయెదను. (లేచును)

జయ—(చేయివట్టుకొని) జయంతా! సీతోడు. నాకేమి తెలియదు. కూర్చుండుము.

వనపా—(సానితో) ఎవరికొఱకు వచ్చినావు? తిన్నఁగా చెప్పుము.

పంక—(తనలో) ఇతఁడిట్లడుగుటకు కారణమేమైయుండును? (ఆలో
చించి) ఓయీ! అక్కడ ఎవరెవ రున్నారు?

వనపా—రాజకుమారుఁడును మంత్రికుమారుఁడు నున్నారు.

పంక—(నవ్వుచు) సరే; తెలిసినది. ఇద్దఱికొఱకును వచ్చితినని చెప్పుము.

వనపా—(వెళ్ళి) ప్రభూ! మీయిద్దఱికొఱకును వచ్చినదఁట

జయ—(నవ్వుచు) మిత్రమా! ఇప్పుడేమనెదవు ?

జయం—సానిపిల్లగదా! సమయస్ఫూర్తిగ చెప్పినది.

జయ—రావచ్చునని కబురంపుదునా?

జయం—వద్దు వద్దు. నామాటవినుము.

ఉ॥ మానినిఁ గొండఁగావలయు మానముపై అభిమాన; మట్టిచో
మానముమీఁద చిన్న మభిమానము లేక ధనంబె గొప్పగా
మానసమందు నెంచి అనుమానములజ్జ త్యజించి హీనురాల్
సాని మెలంగుఁగా; వలదు లజ్జను చెంతకు చేరనిచ్చుటల్

జయ—(నవ్వుచు) జయంతా! ఎందుకీభయము? అది అబల. అందు
లో సానిది. మనల నేమిచేయఁగలదు?

జయం—వెలయాండ్ర మాయలలోపడి ఎందఱెందఱో ధనగౌరవా
రోగ్య ప్రాణంబుల వమ్ముజేసికొనినారు మనమనఁగా ఎంత ?
కాన దానిని చేరనీయకుండుటే సన్మతము. బ్రవేలుచూపిన
మండ్రమింగుజాతి సానిజాతి. కాన నామాట వినుము.

జయ—దానిమాయలో పడినపుడుగదా చెడుట? ఈజయపాలుఁడు
సులభసాధ్యుఁడు కాడని నీవెఱుంగవా ?

జయం—అట్టి దృఢనిశ్చయమే నీకున్న రానిమ్ము.

జయ—సేవకా! నీవు త్వరగాపోయి ఆసాని నంపుము,

వనపా—చిత్తము. (వెళ్ళి) యువరాజాజ్ఞయైనది; వెళ్లుము. బహుమా
నము చెడిసగము; మఱచిపోకుము.

వంక—[చిఱునవ్వుతో ప్రవేశించి]యువరాజచంద్రా! నమస్కారము ప్రతిక్షత్రియ కుమారతిలకమా! వందనము.

జయ—వారాంగనా! నీవిప్పటికి రాబనియేమి?

వంక—రసికశిఖామణీ! తమదర్శనార్థము నేకదినములనుంచి వేచియుంటి ఇన్నిదినంబులకు దైవానుగ్రహంబున తగినసమయంబు సంప్రాప్తమైనది

జయం—[తనలో నవ్వుచు] ఔరా! ఏమిమాటకారి మాటనేర్పు; ఇతడు రసికశిఖామణియట! ఈతోత్తు. ఇతనిదర్శనమునకై అనేకదినంబులనుండి కాచుకొనియున్నదట! ముఖస్తుతులకుం కల్లలకు వేశ్యపుట్టినిల్లుగదా! ఈయ్యాలిమాటలచే వీనిని పొంగవేసి గోతపడద్రోయ ప్రయత్నించుచున్నది.

జయ—వారాంగనా నీవింతగా ఎదురుచూచుటకు కారణమేమి?

వంక—నా నృత్యగానాభినయంబులను తమకు చూపి తగునన్మానము నందవలెనని యుంటిని.

జయం—[తనలో] ఊ. ఊ! అంతకతంత సరసము ముదురుచున్నదే.

జయ—అలాగునా? జయంతా! కొంచెము నీవు ఈమె ఆటపాటలు కని విని వినోదింతమా?

జయం—వద్దువద్దు ఇప్పుడైన నామాటవిని త్వరగా దీనిని సాగనంపుము తాయి గుద్దనేల? చేయి నొవ్వనేల

గీ॥ ఎప్పుడీజాతినాతులన్ • తప్పకుండ
దూరముగ ఉంచుటే మంచి • దారయంగ;
చనువు రవ్వంత వారికొ • సంగినమొదల
వదలకుండు బ్రెల్లరకసి • పొదలపగిది.

జయ—వినోదముగాక యించు తప్పేమున్నది? ఎటులైనను దీనికి కానుక ఈయక తప్పదుగదా. ఆ పాటలు చూచియే ఇత్తము.

జయం—ఏమీ? తప్పలేదా? కాసునకు మానముతెగనమ్ము వేశ్యను
చేరనిచ్చుటే తప్పు; పిమ్మట దాని అసందర్భ ప్రలాపము
లకు చెవియొగ్గుట గొప్పతప్పు ఈతప్పులుచాలక యింక దాని
ఆటపాటలు చూచెదవా?

సీ॥ వెలబోటి నెఱినీటు ♦ వలెవాటు తగుగోటు
కాంచిన వింతగా ♦ కానవచ్చు;
వెలనారి నుడితీరు ♦ చెలువారు నడసారు
కనువారి సంతోష ♦ మునను దేల్చు;
వెలయాలి వాలుఁజూ ♦ పులు టక్కు టెక్కులు
స్థిరచిత్తములనైన ♦ చెదర గొట్టు;
ఆటపాటలు మంద ♦ హాసముల్ పైఁట జా
ర్పులు మోహవార్థిలో ♦ ముంచివేయు;
దొంగచూపులు మనసును ♦ దొంగిలించు;
కన్ను సన్నలఁ జ్ఞానంబు ♦ సన్నగిల్లు;
పిదప మగవాఁడు దానికి ♦ భృత్యుఁడగును;
ఇహపరంబుల రెంటిఁట ♦ ఎగ్గు గాంచు

మఱియు పొట్టపోసికొనుటకు నాలుగు కొక్కిరిబిక్కిరి పాటలు
సగము సగము కంఠపాఠము చేసిన ఈ నిరక్షరకుక్షి రసిక
సిరోమణివగు నీ యుల్లమును రంజిల్ల జేయఁగలదా?

సీ॥ ధనమున కాశించి ♦ వినుట కనువుగాని
పచ్చిబూతుల నెల్లఁ ♦ పాడుచుండు;
రాగమాలిక దక్క ♦ రాగ మేదియు కూడ
తీరుగా పాడఁగా ♦ నోరు రాదు;
ఎలుఁగుగొడ్డు విధాన ♦ ఎగిరి గెంతులె కాని
మానితనృత్యము ♦ మాసిపోయె;

సన్నిపాతపురోగి ♦ చందము గనంబడు
నట్టుల అభినయం ♦ బాచరించు;
ఇట్టి నోరు విప్పినయెడల ♦ చుట్టకంపు
కోసుమారము వఱకును ♦ కొట్టుచుండు;
ఇట్టి వెలయాండ్రి నేవిధిఁ ♦ హెచ్చరింవ
కూడదయ్యా యిమ్మాటికి ♦ కూడదు సుమ.
కాన నాకెంతమాత్రము దీని ఆటపాటలను చూచుటకిష్టము
లేదు. నాపలుకులయందావంతయైన నీకుగౌరవమున్న దీని
శీఘ్రముగా సాగనంపుము.

పంక—రాజకుమారరత్నమా! నాదొకమనవి చిత్తగింపుడు

సీ॥ అభినయగానాదు ♦ లడుగంటి పోకుండ
భూమి నిల్పినవార ♦ మేము కామె?

జయ—[నవ్వుచు] జయంతా! ఇప్పు డేమనెదవు?

జయం—ఏ మందునా? వినుము.

మానాభిమానంబు ♦ మాని దానివి వీధిఁ
బెట్టి అమ్ముకువారు ♦ వీరు కారె?

పంక—భార్యలు లే కేడ్చు ♦ బ్రహ్మచారుల వెత
లెల్లఁదీర్చెడువార ♦ మేము కామె?

జయం—హేయమై నింద్యమా ♦ ఎల్లరోగంబుల
కారయఁ బుట్టింత్రు ♦ వీరు కారె?

పంక—శుభకార్యముల కెల్ల ♦ శోభ సంపూర్తిగా
ఇచ్చెడు వారల ♦ మేము కామె?

జయం—లక్షాధికారుల ♦ భిక్షకులుగఁ జేసి
వెళ్ళఁగొట్టెడు వారు ♦ వీరు కారె?

పంక—సురల రంజింప అ ♦ చ్చరలున్న నరులకు
ఇంపు గూర్చెడువార ♦ మేము కామె?

జయం- మూఁడువంతు లకాల ♦ పుంజావుల కకటా !
కారణ మెయ్యెడఁ ♦ వీరు కారే?

పంక- కామశాస్త్రమర్మజ్ఞుల ♦ మేము కామె?

జయం- విమలసంఘకంటకములు ♦ వీరు కారె?

పంక-- సామి! నిత్యపుణ్యస్త్రీల ♦ మేము కామె?

జయం- ఔర! మనుజసృగాలముల్ ♦ వీరు కారె?

పంక- ఇట్టి అనద్భుతకీర్తితో ♦ ఎచ్చరి లేదు
సానులమించు చానలు ♦ జగతిఁగలరె?

జయం- ఇట్టి పరమదుర్మార్గుల ♦ నిటుల తెలిసి
చేర నిచ్చుటే పాపంబు ♦ చెల్మికాఁడ !

పంక—మంత్రికుమారశేఖరా! దాతలచెంతఁజేరి యిట్లు కొండెము లాడుట సజ్జనులకు పాడియా ?

జయం—పాడిగాకేమి? పాత్రాపాత్రములరయక బహుమతులిచ్చుట చాల పాపము.

జయ—జయంతా! నీపలుకు లాదరణీయంబు లే. కాని ఐదునిమిషంబు లీమె నాడించుటకు నాకు సెలవిమ్ము.

జయం—నేను చెప్పవలసినది మోమోడక చెప్పితి పిమ్మటనీయిష్టము. నేను వలదనిన మానెదవా?

జయ—తప్పక మానివేసెదను?

పంక—(తనలో) అయ్యో! ఈజయంతుఁడు శనివలె ఇక్కడ చేరినాఁడే! నాపాచిక పాఱనీయఁడు కాబోలు ?

జయం—నీవినోదప్రవాహంబును నేనేల అడ్డపెలెను? కానిమ్ము.

జయ—వారాంగనా ! నీయాటపాటలఁ గల నిపుణత ఐదునిముషంబుల లో జూపవలయు త్వరపడుము.

పంక—చిత్తము.

మధ్యమావతి - ఆదితాళము.

సామీ! యిటు చూడరా - సమయ మిదేరా, నా। సా॥
కామజితసుందరా! నామనవి వినరా, యిటు రారా॥ సా॥
ఈవాడి విడనాడి - నామొఱ్ఱ చెవి నిడి
స్వామి నను ముద్దాడి - సరసము లాడరా, నీదానరా॥ సా॥
ఇంత సిగ్గేలరా - ఏల రా వేలరా
పంతముమానరా - వగకాఁడా! నామోవి, పానకమిచ్చెద॥ సా॥
(పాడుచు నృత్యము చేయును)

జయ—వనపాలా! ఇటురమ్ము. (వాని చెవిలో చెప్పినట్లభినయించును.)

వనపా—చిత్తము. (పోయి ఫలపుష్పాదులు పళ్ళెరమున నుంచియువ రాజుకడకు తెచ్చును.)

జయ—(జయంతునకిమ్మని కనుసైగ చేయును)

జయం—[జయపాలునకిమ్మని కనుసైగ చేయును]

జయ— ఆమె కిచ్చివేయుము.

వనపా—[ఇచ్చి వేయును.]

పంక—[పుచ్చుకొని] యువరాజచంద్రా! పోయివచ్చెద. సెలవిండు.

జయం—మంచిది. వెళ్ళుము.

పంక—దయయుంచుఁడు. సచివసుతాగ్రేసరా! సెలవిండు. పోయివచ్చెద

జయం—మంచిది.

పంక—నన్ను మఱచిపోకుఁడు. ప్రక్కగాఁబోయి మెల్లగ ఈలవే యుచు చేతులు తట్టుచు] మంత్రికుమారశేఖరా! మంత్రి కుమారశేఖరా!!

జయం—[వెనుకకు తిరిగి చూచును.]

పంక—[రమ్మని సైఁగచేయును]

జయం—[వెళ్ళి] ఎందుకు పిలిచినావు?

వంక— (నవ్వుచు) ఏమియు లేదు; వెళ్ళుడు. మతాబా! (దాగి యుండును.)

జయం— (తనలో) ఘోరా! ఈటక్కరి నన్నెంత పరాభవించినది! (పోయి కూర్చుండును.)

జయ— (నవ్వుచు) జయంతా! కోడలికి బుద్ధిచెప్పి అత్తయేమో చేసినదట! నీవంటిదే.

జయం— ఏ మట్లనుచున్నావు? నీ వెందు కాసామెతపొడిచినావో నాకు స్ఫురింపకున్నది.

జయ— అవునవును. స్ఫురింపదు. నీవు చెప్పినట్టుల లంజమాయలలో పడినవాని తెలివితేటలు నశించుట వాస్తవమే. ప్రత్యక్షముగా ఇపుడు కనుగొంటిని.

జయం— ఏమీ? నేను లంజమాయలలో పడితినా! చాలా లు ఎవరైన వినిన నవ్వెదరు.

జయ— కన్నులారజూచుచున్న నన్నే బూకరించెదవా? నిన్నది సైగ చేసి పిలువలేదా? నీవు వెళ్ళలేదా?

జయం— అవును. పిలిచినది. వెళ్ళితిని. వెళ్ళినందుకు తగిన పరాభవమైనది.

జయ— నీతో చెప్పినది.

జయ— దగ్గఱకు పిలిచి, "దాసరీ! నీకన్ను లొట్ట," అనునట్లు. "ఏమియు లేదు; వెళ్ళు." అన్నది.

జయ— స్నేహితుని కడ నాదాపరికములు కల్లలుకవా! మంచిస్నేహితుండవే! ఇన్నాళ్ళకు నీగుణము తెలిసినదిలే.

జయం— (ఆశ్చర్యముతో) ఆ! ఇదేమి జయపాలా! నిష్కారణముగా నన్నేల నిందించెదవు? ముమ్మాటికి నేను చెప్పినది సత్యము! సత్యము!! సత్యము!!!

జయ— ఛీ! మిత్రద్రోహీ! విశ్వాసఘాతకా! నాకన్నుల దుమ్ముగొట్ట నెంచుచున్నావా?

ఉ॥ ఇన్నిదినాలనుండి మదినెన్నితి ప్రాణసఖుండ వంచు ని
న్నన్నన! మోసపోతిఁగదరా! వెలివుచ్చితి నీదు స్నేహసం
పన్నతి, నీదుమోసపు స్వభావము, నీచబుద్ధి వౌర ప్రి
చ్ఛన్నపు ధూర్తశత్రుఁడ! ప్రపన్న వహితాకృతినున్న భూతమా!

జయం—(భయాశ్చర్యములతో) నేసమా? ఇదేమి? హాస్యమా? నిజమా? నాకు మతిపోవుచున్నది

జయ—నీతో హాస్యమాడుటకు నేను సాటి వనుకొనుచున్నావా? పచ్చకామాలగోగికి లోకమంతయు పచ్చగా అగపడునట్లు విపరీతమోహాంధకారంబున బడిన నీకందఱును సానులవలెనే కానవత్తురు.

జయం--(విచారవిషాదంబులఁదనలో) వీనికినిజముగా కోపము వచ్చియే నన్ను నిందించుచున్నాఁడు (పైకి) మిత్రమా! నామాటలందు నీకు నమ్మకము లేదా? నేనెన్నఁడైన నీతో అసత్యములాడితినా? నేను క్రొత్తవాఁడనా? చిన్నతనంబునుండియు నామనసెఱిఁగిన నీవే తెలియకున్న దురభిప్రాయపడుట పాడియా? నాతలిదండ్రులను చంపుకొని తినపట్లు; నాతో ఆవెలయాలేమియు చెప్పలేదు. ఇందుకింత కోపమేల? ఈదుర్భావ మేల? నీకసితీఱ ఒకవ్రేటున నాకంఠము నుత్తరింపుము. (సమీపించును)

జయ—ఛీ! ఛీ! దూరముగా పొమ్ము. నీవంటిమిత్రద్రోహుల దండింప యముఁడుండు టెఱుంగవా?

జయం—మిత్రరత్నమా! ఆవేశ్య నాతో ఏమియు చెప్పలేదు. నీపాదములతోడు (జయపాలుని పాదములఁ బట్టుకొనును.)

జయ—(తన్నివేసి) ఛీ! అధమాధమా! నీనక్క వినయంబులింక చాలించిపొమ్ము.

అఠాణా ఆది.

పోరా కదలి పోరా— లేరా నాయెదుటనుండి॥ పోరా॥
ఏరా సిగ్గులేదా యింక—ఇటుల బొంకులాడ, వేగ॥ పోరా॥

నీమెలుఁగు మాటలెంచి- నిశ్చయముగ మోసపోకు;
నామనంబు నొచ్చి చాల-బుద్ధి వచ్చె నేఁడు॥ పోరా॥
చాలుఁ చాలు నీదుచెల్మి- జాల మేల? లేచిపోర
కాలఫణిని చేరఁదీసి- పాలు పోయఁ దగున తెలిసి॥ పోరా॥

జయం—[తనలో] నాయెడ మాకన్నదానికందుకు ఫలము వెంటనే కనఁబడినది (పైకి) హా! జయపాలా! వెన్నకంటె మెత్తనగు నీచిత్త మిప్పుడేల యింత గట్టిపడినది! నీకింతకోప మెక్కడనుండి వచ్చినది!

శహానా-త్రిపుట

శాంతింపుమా సఖా!- శాంతింపుమా దయతో
ఇంతతొందర కూడ- దెందు నామాట విను॥ శాంతి॥

జయ—ఔరా! ద్విపాదపశువా! సిగ్గుమాని నాకు నీతి చెప్పెదవా? పొమ్మ (త్రోసివేయును)

జయ—కల్లలాడు నేను; నా- తల్లితోడు నమ్ముమా
ఉల్లముసకొంచెము- యోచింపుమా నేస్తమా॥ శాంతి॥

జయ—వనపాలా! ఇంకను చూచెదవేమి? వీనిని పైకి గెంటివేయుము

వనపా—అయ్యా! ప్రభువులకు ఆగ్రహము వచ్చినప్పుడు సన్న సన్నఁగ జాఱిపోవుట మంచిది రండు. (చేయిపట్టుకొని లాగును.)

జయం—నేస్తమా! నీకిది న్యాయము కాదుసుమా.

జయ—ఔర! నేను చెప్పినచొప్పున చేసెదవా? తన్నమందువా?

వనపా—అయ్యా! మంచిగా చెప్పిన వినఁబడదా యేమి? నడుపుఁడు నడుపుఁడు (త్రోయును.)

జయం—నిలకడపై నిజము- నీకే తెలియు నయ్యా?
తలఁచుచుండుమా నన్ను- సెలవిమ్మా పోయెద॥ శాంతి॥

జయ—పొమ్ము.

జయం—నిర్దోషినగు నన్ను మఱచిపోకుము. (పోవును)

జయ—(తనలో) ఈవేళ నామనసంతయు పాడైపోయినది. ఇంటికి వెళ్ళి మానాన్నగారి సెలవుపుచ్చుకొని మాఅత్తవారింటికి పోయెదను. (పోవును.)

వంక—(పైకివచ్చి సంతోషముతో) సెబాస్! నాయెత్తు చక్కగా ఫలించినది. ఇప్పుడే రాజుకడకువెళ్ళి వేనూటపదున ర్లు పుచ్చుకొనెద. (పోవును.)



# ద్వితీయాంకము

## ప్రథమరంగము—రాజమార్గము

[విచారగ్రస్తుఁడగు జయంతుఁడు ప్రవేశించుచు.]

జయం—కటకటా! కటికివిధీ? ఎంతపొరపాటు చేసితివి! ఎంతపొర పాటుచేసితివి!! సృష్టికర్తనని విఱ్ఱవీగుచుందువేకాని నీసృష్టి యంతయు తప్పులకుప్పకదా?

ఉ॥ త్యాగికి జల్ దరిద్రదశ, ఆతతలోభికి చాఁలసంపదల్,
భోగికి జీర్ణసంకటము, భూరిదరిద్రునకెంతొ ఆఁకలిన్,
జోగికి పుత్రసంతతి, వసుంధరనేతకపుత్రతార్తి, ఉ
ద్యోగికి దుర్బలత్వము మహోన్నతదేహపటుత్వమల్ల బై
రాగికి కూర్చుండెదవు రా! మతిమాలిన పాపపువ్విధీ!

ఇదియునుగాక సన్మార్గునకల్పాయువు, దుర్మార్గునకు దీర్ఘాయువు, సుందరాంగికి వికలాంగుని, వికలాంగికి సుందరాంగుని, కొడుకు కావలెనని కోరుచుండు కులకాంతకు కూఁతును, కూఁతురు కావలెనని కోరుచుండు వెలయాలికి కొడుకును, ప్రాణస్నేహితులకు విరోధంబును, అన్యోన్యానురాగంబుగల దంపతుల కెడఁబాటును, నమకూర్చు నీవు కంటికగపడకున్నావుగదా! బ్రహ్మహత్యా మహాపాతకంబు మాట అటుండనిమ్ము. లోకులకు మహోపకారంబు చేసినవాఁడ నగుదును. హా! ప్రాణసఖా! జయపాలా! ఎంతతొందరపడితివి!! మనము కలిసికొనిన వేళావిశేషంబుకాకున్న నాపై నీకెదివఱకెన్నఁడును లేని అనుమానము నేఁడేల కలుగును; అంతకోప మెక్కడనుండి వచ్చును. హా! తొత్తా! ఎంతపనిచేసితివి! మిత్రరత్నమా! ఈదినంబున

నన్నువిడిచిపెట్టి నీవు మామగారి యింటికినన సిద్ధమగుచున్నావా? నీవు నాయెడ అకారణంబుగ శత్రుభావము వహించి, ముక్కుమొగ మెఱుంగని వానివలె నీచుఁడగు సేవకునిచే గెంటించివేసితివి; కాని నాకు నీయందు మిత్రవాత్సల్యము తప్ప, విరోధభావముగాని కోపముగాని రవ్వంతయు లేదు. కాన నేనుమాత్రము నిన్ను విడుచునది లేదు. మిత్రద్రోహినఁయు కృతఘ్నుఁడననియు నీచుఁడననియు నీవు నన్నుతిట్టితివి. కామ్కు. నేనట్టివాఁడను కానని పనులచే రుజువుచేసి చూపవలసిన భారము నాది కనుక నేను నీవెంటనే వచ్చెదను. (కొంతదూరము నడచి) ఈ వేషముతో వెళ్ళిన లాభములేదు. బైరాగివేషముతో పోయెదను. (పోవును.)

ద్వితీయరంగము—పొలిమేర

[శిరవాదుఃఖశయగు భానుమతి ప్రవేశించును]

భాను — నీలాంబరి - త్రిపుట

న్యాయమా కన్నడచేయుట? - నాథా! రాట్కులయోధా!

మీయనుగ్రహ మిప్పటికైన - యీయబలపై రాలేదా? ॥ న్యా॥

తోడినారులెల్ల ప్రియులఁ - గూడి సౌఖ్యములఁ దేలి

యాడుచుండఁగా నాపాప - మా పతివిరహాగ్నిగూల॥ న్యా॥

ఏడేండ్లను డి నన్నుఁజూడ మీ - రేవేళ వత్తురో యని నే

వేడుకతో చూచి చూచి - విసిగిపోతి; నిరాశ యయ్యె॥ న్యా॥

హా! ప్రాణేశ్వరా! దైవానుగ్రహంబున సుగుణరత్నాకరుండును, సుందరాకారుండును, సారతర శస్త్రాస్త్రాది విద్యావిశారదుండునగు విభుం డ నాకు దొరకెఁగదా యని అమందానంద మొందుచుండ నన్నిట్లు పరాభవించి సాటివారిలో తలయెత్తుకొని తిరుగనీయకుండ జేయుట మీకు ధర్మమా? నను కంటజూడకుండుటకు నేనేమి తప్పుచేసితిని? నాయందేమివంక యున్నది? మాయూరి అమ్మలక్క

లందఱు నన్ను కనినప్పుడెల్ల, "మగఁడీమెను విడచి పెట్టినాఁడా"ని ఒకరి చెవులొకరు కొఱుకుకొనుచుందురు. పండుగరోజులందు తోడికోడండ్రును దివ్యాభరణంబులు ధరించి, మేల్ముసుంగులు మైఁగట్టి చిదిద్దిలా సంబరపడఁగ నేనొక మూలఁబడి సిగ్గుచే పైకి రాలేక కుందుచుందును తల్లిదండ్రులా నను గని దుఃఖించుచుందురు హా! మనోహరా! నేనెన్ని యుత్తరంబులు వ్రాసినను, ఒక్కదానికైన ఒట్టుపెట్టుకొనినట్లు జవాబిచ్చినారు కారుగదా! నా జననీజనకులు తాము కడుచక్కనివారని అనుకొనుట వింటినే కాని కన్నులార మీ సుందరవదనారవిందమును తిలకించి సంతసించుచుండు భాగ్యము నాకింతవఱకబ్బలేదు కదా! పెండ్లి యైనదినంబునను పాడుసిగ్గు నానెత్తిపై కూర్చుండుటచే ముఖమెత్తలేకపోయితిని. అయ్యో! పతి యెప్పుడువచ్చి ఆదరించునో అను నాశచే

మొడికట్టైనె యింతదాఁక - బొందితోడ ఉంటిఁగాని।
ఉండఁజాల ఇఁకమీఁద - ఉసురులబాయుదాన॥ న్యా॥

కాత్యా—(ప్రవేశించి తనలో) ఇదేమి? ఈ నిర్జనప్రదేశంబున భూతములు కాల్లాడు ఈ కటికచీకటిలో స్త్రీయార్తనాదము వినవచ్చుచున్నది... పాపము! ఆమెను పిశాచములు పీకికొని తినుచున్నవో దుర్మార్గులెవరైన బాధించుచున్నారో! (నలుదెసలు చూచి) అదిగో! ఆమఱ్ఱిచెట్టుదగ్గఱ ఒక స్త్రీరూపము కాన్పించుచున్నది. [వెళ్ళి] నారీమణీ! ఎవరు నీవు? ఈ యర్ధరాత్రంబున ఇచ్చటికేల వచ్చితివి?

భాను—అమ్మా? మీ రెవరు? ఎక్కడకు వెళ్ళుచున్నారు?

కాత్యా—నేను యోగిని, గంగానదియందు స్నానమాడబోవుచున్నాను.

భాను—తల్లీ! నమస్కారము. నన్నుగూడ తీసికొనిపోయి గంగాదేవి కప్పఁజెప్పుఁడు. మీకు చాల పుణ్యముండును.

కాత్యా—యువతీరత్నమా! ఎవరిదానవు? గంగలోపడుటకు నీకేమి యుపద్రవము వచ్చినది? నాతో చెప్పుము. చేతనగు సాయము చేసితీరెదను.

భాను—తల్లీ! ఏమని చెప్పుదు? పతిమన్నన లేని సతిగతి వితగదా!

కాత్యా—నిజము నిజము. కాన నీవు సుమంగళివలె అగపడుచున్నావే. నీకీ విచార మెందుకు?

భాను—పుణ్యస్త్రీనైనను, భర్తృవిరహదుఃఖసాగరంబున పడి చివుకుచున్న దానను.

కాత్యా—అయ్యో! పాపము! ముక్కుపచ్చలారని నీకెట్టి కట్టియిక్కట్టు దాపరించినది! కారణ మేమమ్మా?

భాను—నాదురదృష్టమే కారణమనితలంచెద. అంతకంటె ఒండొక కారణ మగపడదు.

కాత్యా—తగదు తగదు; నీకింత సాహసము తగదు. నామాట వినుము. కొంతకాలము చూడుము.

భాను—ఎంతకాల మోర్తును?

సీ॥ పరిణయంబై నాకు ♦ వర్షంబు లేడాయె;
వల్లభుం డింక న ♦ న్నొల్లండాయె;
ప్రాయము మెడారిలో ♦ పడిన వర్షంబాయె;
పదిమందిలో నగుఁ ♦ బాటులాయె;
చెలువంబు కానఁబూ ♦ చిన మల్లెపూవాయె;
కోరిక ఒక్కటైనఁ ♦ దీరదాయె;
తల్లిదండ్రులకు నా ♦ వల్ల దుఃఖంబాయె;
ఆశ లన్నియును ని ♦ రాశలాయె.
దినము నాకు విచారమే ♦ తిండి ఆయె;
ప్రాణములమీఁద అరుచి అ ♦ త్యంతమాయె;
మొండికెత్తి యుం కెన్నాళ్ళు ♦ పుత్తునమ్మ!
చాలు ఈపాడు బ్రతు కిఁక ♦ చాలునమ్మ!.

ముందేమి దుర్బుద్ధిపుట్టునో? ఏమి అపవాదుల పాలగుదునో?
కనుక నన్నాగంగాభవాని కప్పజెప్పెదను (కాళ్ళపైబడును.)

కాత్యా—(లేవదీసి) వెఱ్ఱివానా! కాల మెప్పు డొక్కరీతిగ ఉండునా? తొందరపడకుము జగన్మాతయగు కాళిని నీకొఱకై కొక సారి పూజింపుము.

మంత్రోపదేశము చేసెద; రమ్ము. (పోవుదురు)

---

## తృతీయరంగము—అంతఃపురము

[విచారించుచు భువనసుందరి ప్రవేశించును.]

భువ—ఔరా! పాపమగడా! వానచినుకవలె నీ వెక్కడనుండి నేడు ఊడిపడితివిరా! నావంటి శనిగాడవుకాని మగడవు కావు. మగువమక్కువ ఎవ్వనియందు తగిలియుండునో వాడే మగడు కాని పుస్తెకట్టినవాడా మగడు? ఛీ! కాదుకాదు. నీ వెక్కడి పతివి? నేనెక్కడిసతిని? అసంబంధము నాదే పొంగనది... మా నాన్నగారెన్నిసార్లు కబురంపినను రాక, ఈ వేళ ఏమొగము పెట్టుకొని నన్ను చూడ వచ్చితివిరా? నీతోనె నా బ్రతుకున్నదని అనుకొని కాణాలు పిలిచినపుడెల్ల బిగువు చూపితివి? వెఱ్ఱివాడా! నిన్ను తలచదన్ను మగని ఇంకొక్కని నే నెక్కడ సంపాదించి, నీమాట మరచిపోతినని యెఱుంగువా? ఎత్తి గియున్న ఎందుకు వచ్చెదవు? ఎప్పుడెప్పుడు దయజేయుదువోయని నీవు వచ్చువఱకు కాచుకొని యుండుటకు నీవు డబ్బిచ్చికొన్న బానిసననుకొంటివా? నీ వొక రాకొమరుండవైన నేనొక రాకొమార్తెనను. కాని నే నింతదాక నిరాటంకముగా అనుభవించుచున్న సుఖంబునకు పానకములోని పుల్లవలె అడ్డువచ్చితివికదరా! పాపాత్ముడా!

భైరవిదావద్రి - అటతాళము.

ఎదురుగా వచ్చితివిరా?– ఏనాటి చుట్టరికము?
ఎంతటెంగటో చచ్చుచుండ– నీవుంకపోతి వటరా?॥ ఎం॥
పాపీ! రాయి వనికి పాత్రంబులు– స్వర్గముకాదు
ఓపిశాచమా! నీతోడ– కాపుర మేం జేయ నొల్ల॥ ఎం॥
ఎల్లమతల్లీ! ఈనీచుని– కొల్పుకున్న నాయొనేని
కల్లుకుండల నర్పించెద– నల్లమేకల బలివేసెద॥ ఎందు॥

ఔరా! తానొకటి తలంచిన దైవమొకటి తలంచునను పెద్దల మాట కల్లకాదుకదా! చీకటురాత్రి లెప్పుడెప్పుడు వచ్చు, ఎప్పుడు నాముద్దుల మేదరిమగని కూడి హాయిగా నుండుదునని ఉవ్విళ్లూరుచు తిథు లెక్కించుచు, నేను చీకటిరాత్రి యగుటచే నామోహానసముద్రంబు ప్పొంగి లజ్జయను చెలియలి కట్టను మీఱి పొరలిపాఱుచుండ, పెనుగొండవడువున పీడ వచ్చినాఁడు. ఏమిచేయుదు? రాత్రి యెల్లు దాలుటకు వీలుండదు పడకగది ఇంద్రభవనంబును మఱపించున ట్లలంకరించినారు. రాత్రికడిసంతనె వచ్చి కోటిదగ్గఱ కంపెదరు. హా! దైవమా! నాకీతద్దినము తప్పుటెట్లు?... వానితో ఒక గడియయైన ఉండలేను. నామనసున కచ్చినవాఁడా మేదరిబావ వానినీటు, వానిగోటు, వానిహాసు, వానివయసు, వానిబాళి, వానిజాలి, ఈవందిని కోసినను కనఁబడవు. నా మేదరివగకాడు కొంచెము నల్లఁగానున్న నేమి? నీలమేఘశ్యాముఁడు వాని మొలగుడ్డయు తలగుడ్డయు, మాసినట్లు పైకగపడునేకాని అవి కాంచనాంబరంబులు. వాని చేతికత్తి సుదర్శనము; వానితో భోగ మింద్రభోగము. వాని కమ్మగుడిసె వైకుంఠము. కనుక నేటిరాత్రి ఏలాగునైన వానినిగూడిసుఖింప ఎన్ని విధములనైన ప్రయత్నించెద.

(నంగనాచిఅను దాసిప్రవేశించును.)

నంగ—అమ్మా! దేవిగారు మిమ్మ అలకరించుకొనుటకు పిలుచు చున్నారు.

భువ—ఏమి అలంకారమే! నాకేమియు తోచకున్నది. ప్రొద్దుట నేను చెప్పినపని చేసినావా?

నంగ—వెంటనేవెళ్ళి వానితో చెప్పినాను.

భువ—చా! నేనొకటితలంచిన దైవమింకొకటి తలంచెను. ఏమి చేయుదు?

నంగ—అమ్మా! దీనికింత విచారమేల? ఇప్పుడేవెళ్ళి తమభర్తరాక వానితో చెప్పెదను.

భువ—వద్దు, వద్దు, నేడెటులైన అక్కడకు వెళ్ళవలెనని ఉన్నది. నాకోరిక ఫలించుటకు ఏదైన ఉపాయము చెప్పగలవా?

నంగ—[ఆలోచించి] మత్తుమందున్న, తమకోర్కె ఫలించును.

భువ—అదేమిచేయును?

నంగ—దాన ప్రాణభయము లేదు కాని పాలతో కలిపి యిచ్చిన, మతిపోగొట్టి గాఢనిద్రలో ముంచును.

భువ—(సంతోషముతో) అలాగునా? అదెక్కడ చిక్కును?

నంగ—ఎఱుకలవాండ్రదగ్గఱ దొరకును. కాని వారు సాధారణముగా ఈయరు

భువ—ఈయుంగరమును తీసికొనివెళ్ళి ఎటులైన ఆమందును తీసికొని రమ్ము (ఉంగరమిచ్చి) తీసికొనివచ్చిన, నీకుమంచిబహుమతి చేసెదను.

నంగ—చిత్తము [పోవును.]

భువ—జాగ్రత్త-ఒకపిట్టకైన, తెలియకూడదుసుమా. (తనలో) ఇప్పుడు నామనసు కొంత కుదుటబడినది. (పోవును)

—

## తృతీయ రంగము—అంతఃపుర ప్రాంతము

[జయంతుఁడు సన్న్యాసి వేషమునఁ బ్రవేశించును]

జయం—(స్వగతముగ) దైవానుగ్రహంబున జయపాలుఁడీ గడియ వఱకు నన్నెనేక పర్యాయములు చూచియున్నను గుఱుతుపట్ట లేదు. సిబాస్! ఈ వేషము బాగ బాగుగా సరిపోయినది. నన్ను చూచినప్పుడెల్ల ఎవఁడో క్రొత్త బైరాగియని అనుకొనుచున్నాఁడుగాని తన బావ స్నేహితుఁడగు జయంతుఁడని వానికి తట్టుటలేదు అని మది కదా!... ఈ సమయంబున అతఁడీ భువనసుందరి మందిరంబును చేరి, ఆమెతోఁ గూడి సౌఖ్యానంద పరవశుఁడై యుండును నేనో ధూళిధూసరంబగు నేలపై దొడలు గడగడ కొట్టుకొనఁజేయు చలిలో మోఁకాళ్ళను కౌఁగిలించుకొని పండుకొనవలసినదే కదా! అక్కటా! జవ్వని యగు భార్యను విడనాడియుండు టెంత తెలివితక్కువ!

చ॥ కలసతి చెంతఁ జేరి కడు గూరిమితోడ తముద్దుపల్కులన్
పలుకుచు మెల్లమెల్ల, చిఱునవ్వుల నవ్వుచు, నర్మగర్భపుం
బలుకులఁ బల్కుచున్, తముల పాకలచిల్కలనోటికిచ్చుచున్
సలలిత సౌఖ్యడోలికలఁ జక్కఁగ నూఁచును గాదె! బాపురే!

సాధ్యమగునంత త్వరలో అతవారింటికిపోయి నా ముద్దుగుమ్మను చూడవలయు. ఇపుడీ విచారమును దూరముగా పాఱఁద్రోల వలయు. లేకున్న వచ్చినపని పాడగును. (మీఁదు చూచి)

గీ॥ ఇంపు నడుగులకు మడుగు లిడఁదలంచి
అలనిశాకాంత పఱపించి ♦ నట్టనజ్రి
పాళి పొదిగిన నీలితి ♦ వాసి యునఁగ
అలరు నహాహా! తారలతోడ ♦ ఆకసంబు

చాల రాత్రియైనది. ఇకపోయి ఆయంతఃపుర బహిర్ద్వారముకడ పరుండెద. (ముందునకు నడిచి నిలిచి) అబ్బ! చలి అంతకంత

కెక్కువగుచున్నదే! సూదులవలె శరీరమునంతయు పొడుచుచుటచే బొటిమలెత్తి శీతపవనకారయను స్మరణము తెచ్చుచున్నవి (గొంగళి తీసి కప్పుకొని) బతే!

గీ॥ ప్రియుని తనకౌఁగిటను హత్తి • ప్రీతితోడ
పాడుచలిబాధఁబాపెను • ప్రౌఢయటుల
పటుల నావంటి విరహులకు • పరమకరుణ
వానచలికాలములను కా • పాడెద వహా!
గొంగళి! సతిలేనికొఱఁత • కొంతతీర్చి. (పోవును.)

---

## పంచమరంగము—శయనగృహము

జయ—(ప్రవేశించి తనలో) కటకటా! నేఁడు నా ప్రాణమిత్రుఁడు జయంతుఁడు జ్ఞప్తికివచ్చుటచే. నా సంతోషమంతయు చల్లారి పోయినది నాచిత్తము వానినిచూడ తత్తర పడుచున్నది. ఆవేళ కోపోద్రేకమున తొందరపడి వానిని దుర్భాషలాడి తగిలివేసితిని. అతఁడు కలనైన కల్లలాడఁడని ఎఱిఁగియు, వాని మాటలు నమ్మనైతిని. ఛా! నేనెంత మందమతిని! అన్యాయములాడి వారాంగన జయంతుఁడు తన్ను నిందించుటచే అలిగి, వానిని పరాభవించుటకై పిలిచి పొమ్మనెనని నాకిప్పుడు తోచుచున్నది... అతఁడిప్పుడు ఇక్కడుండిన వానిగడ్డము పట్టుకొని నా అపరాధము క్షమింపుమని బహువిధముల ప్రార్థింపనా! అతఁడు నాతప్పు క్షమించి, నన్ను మునుపటివలె ఆదరించిన గాని నాకు చిత్తవిశ్రాంతి కలుఁగదు. కానిమ్ము; నేఁటిరాత్రి ఎట్లోగడపి రేపుప్రొద్దుటనే బయలుదేరి మాయూరికి వెళ్ళి మొదట వానిదర్శనమే జేసెదను. అతఁడు చాలమంచివాఁడు; తప్పక నాతప్పును క్షమించి నన్నాదరించును. (మంచముపై

గూర్చుండి) ఈ పడకగదియే యింతసొగసుగా ఉన్నప్పుడిందు
వసియించు కాంతామణి ఎంత అంద మైయుండునో!...
ఏదీ? ఇంకను రాలేదే. (నలువంకలుచూచి సంతోషముతో)
అదిగో! నా ఆలోచనచకోరములవిందు, నిండుపున్నమనాటి
చంద్రుడు, ఆమూల నుదయించినట్లున్నది.

భువ—(కొంచెము బయల్పడును.)

జయ—(తొంగిచూచి. తలయూచి) వా! ఈయింతిమిన్న యింత
చక్కనిదని నేను మున్నెఱింగియుండిన ఇన్నాళ్ళూరకుందునా?

చ॥ అలఘుసమానుగోముఖరి యాడెడు పెన్నెఱిగుంపుసొంపు క
న్నులఁగలపెళ్కు బెళ్కులు మనోహరమౌ అధరంబుడంబు, వ.
ప్పులకల ముక్కుపెంపు నునుబుగ్గలజగ్గు బు. కౌనుజాను మై
చెలువము సౌకుమార! పెఱచేడెలకబ్బునె వీసమేనియున్?

భువ—(తనలో) అదిగో! పెద్దకొండముచ్చువలె మంచముపై కూ
ర్చుండి నోరుతెఱచుకొని చూచుచున్నాడు. నాకు భయ
మగుచున్నది. నాప్రాణము పోయిన సరేకాని వానికడకు
వెళ్ళను

జయ—(తనలో) ఈభవ్యమంగళ విగ్రహంబు నెంతచూచినను తనివి
తీరకున్నది చూచుచున్న కొలంది మఱింత మనోహరంబుగ
గనబడుచున్నది ఈకాంతాలోకచూడామణి నవయౌవనకళా
సంపూర్ణదివ్యాంగదర్శనలాభంబైనపుడు మఱిపోవుననుటకు
సందియము లేదు. మాయురే!

సీ॥ రాహువునకు ఓడి ♦ రాకేందుబింబంబు,
సరిమోముగా మాఱి ♦ సౌఖ్యమందె;
చీకటుల్ సూర్యుని ♦ ధాటికోర్వఁగలేక,
చెలి కురులుగ మాఱి ♦ చింతమానె

ఉప్పు నీటను పడి • యుండ లేక వగడ,
మింతిమోవిగ మాటి • యింపుగాంచె;
స్థిరుఁడు కాఁడని రవి • వరపద్మములు కాంత
కనులై సదానంద • మున మునింగె;
కనక మగ్గికి భయపడి • తనువుచొచ్చె;
గాలికి వెఱచి అరఁటు లం • కములఁ జేరె;
ఔరా! ఈరామ ఘనసురూ • పాభిరామ;
భువన సుందరీరత్న మీ • ముద్దుగుమ్మ

నన్ను చూడవలెనని దృష్టి డాసయున్నను, నన్ను చేరవలెనని మనసెంత తొందఱపడుచున్నను, సిగ్గుమాలిన సిగ్గును భయముఁ లేని భయమును, తన్ను పట్టుకొని బాధించుచుండుటచే తలయెత్తలేక, ముందడుగిడ లేక చలిపిడుగుఁడిన నానిసిఁలె అట్లనిలబడియున్నది. నేనే పలుకరించెద (ప్రకాశముగా) దేవీ! నేనిటనుండఁగా నీవిట్లు లజ్జాభయపిశాచంబులకు చిక్కి పరితపింపనేల? ఇటు రమ్ము నాయంక పీఠిపై నిన్ను గూర్చుండబెట్టి, చుంబనాది రత్నాభరణంబుల నిన్నలంకరించి, ఆపాడుపిశాచముల నిన్నికమీఁదెప్పుడును బాధింపకుండునట్లు భూస్థాపనము చేసెదను. [చేయిపట్టుకొనబోవును.]

భువ — (తప్పించుకొని పోయి దూరముగా తనలో) ఆబ్రహ్మ నిన్ను భూస్థాపనము చేసిన నాకీమనస్తాప ముండదు కదా!

జయ — దూరముగా పోయెదవేమి? నన్నెఱుఁగవా? మన పెండ్లి దినములలో,

గీ॥ నీవు నాప్రక్క కూర్చుండి • నావుకావా!
ఒకరిపై ఒక్కరు తలఁబ్రా • లుంపలేదా!
చేడె! నీవు నేనును బంతు • లాడ లేదా!
అప్పు డుండనిసిగ్గు నీ • కిప్పు డేల?

భువ—(తనలో) చిన్ననాటి ముచ్చటలు తలంచుకొని లొట్టలు వేయుచున్నాఁడు. ఈ భువనసుందరి ఆభువనసుందరి కాదని యెఱుఁగలేకున్నాఁడు.

జయ—సుందరీ! నీసుందరముఖారవిందమును దర్శింప బంధుమిత్రాదుల విడిచి, ఆశ్రితులతో రాఁగ నీవిటుల ముద్దుమోముఁ ద్రొక్క దాఁచుకొనవేమి? ఆఁ! తెలిసినది

గీ॥ ఇంకఁగల దీపముల కాంతి ♦ కందుననియొ,
చలువచూపుల గోడలవన ♦ తొలఁగుననియొ
కాంచనంబనే నాకమల్ ♦ కలఁగుననియొ,
ఏఁచి విరహాగ్ని నన్నుద ♦ హించుననియొ,
ఎత్తకున్నావు ముఖరాజ ♦ మింతిమిన్న!

భువ—(తనలో) నేను కంటబడఁగానె మిరపకాయలు తినిన కాకివలె అఱచుచున్నాఁడు. మంచిమాటలచే వీనిని గోతఁబడఁద్రోయవలెను. (పైకి) ఇన్నదిన ములకీ దాసురాలు తమకు జ్ఞాపకము వచ్చినదా? పోనిండు నేఁటికైన మీమొగము చూచు భాగ్యముబ్బినది. అదే పదివేలు.

జయ—(సంతోషముతో) వా! వా! కల్యాణీ! ఇంతసేపటికి నన్ను ధన్యునిగా చేసినావు. "కష్టీఫలీ" అను నార్యోక్తి వ్యర్థమగునా? కాని—

భువ—కానియని ఊరకున్నారేమి? చెప్పరాదా? పోనిండు; దాఁచుకొనుఁడు

జయ—కొమ్మా! చెప్పుటకు నాకు జంకులేదు గాని జేయుటకు నీ వెక్కడ జంకెదవోయని భయమగుచున్నది. అయినను జెప్పెదను. తరువాత నీ చిత్తము, నాభాగ్యము.

కవిరాజవిరాజితము.

మరుని శరాగ్నిని చిక్కి శరీరము ♦ మండుచున్నది చూడఁగదే;
పరుఁడను కానుకదా నను నీభుజ ♦ పంజరమందున దాఁచఁగదే;

వరమధురాధరపాన మపారప్ర ♦ మాదమతితో నిడి కానఁగదే;
సరియనకున్నను పోవును ప్రాణము ♦ సారసలోచన! నన్నుఁగదే!

భువ—(తనలో) తథాస్తు! తుదిపలుకులు త్వరలో పలింతునుగాక!

జయ—చెలీ! చెలీ!...ఇంక మాటలాడవు కాబోలు! చెప్పినను తప్పే! చెప్పకపోయినను తప్పే! ఇందుదానికొఱిగి తిరుగు మగజన్మమెతుటకంటె అడవిలో మ్రాఁకై పుట్టుటమేలు నీ వెంతటక్కరివే!

గీ॥ ఎంతగాఁ లపున్న, బుంగపాట ♦ మొంత యున్న,
వెలి! చూపక లోలోన ♦ కలఁతపడుచు,
కోరివచ్చిన మగవారిఁ ♦ జేరనీక
బిగువుచూపుచు ముదిపింతు(రు) ♦ మగువ లకట!

భువ—(తనలో) నీవట్లు ప్రమానువై వ్రిసిన నాకీవిచారముండదుకదా!

జయ—కామినీమణీ! నీలో నీవేమో గొణుఁగుకొనుచున్నట్లున్నావు, మాటలేవో పైకని నాకు శ్రవణానందము చేయరావా?

యమునాకల్యాణీ—త్రిశగతి.

మాటలాడవే చెలీ! - మనవి చేకొనవే;
ఏటికింతకోపమిా - దాసునిపై నయ్యో. మాటా॥
నేను చేయుతప్పుల - నీవుగాక నెవరు
మానిపమగుదయ - మన్నింతురు? చెపుమ॥ మాటా॥
జాలమేనఁ సతి! నీ - పాలఁబడినాఁడనే?
పాలలోనముంచెదో - నీళ్ళలోన ముంచెదో॥ మాటా॥

భువ—(తనలో) నిన్ను నదీసముద్రములో ముంచెద. లో. దరపడకు. (పైకి)

మత్తకోకిలలు.

భువ—ఇంతతొందర చెంద పాడియె?

జయ— ఏమిసేయుదు? సుందరీ?

భువ—శాంతమూనుట చాలమంచిది;

జయ— చాలు, నీతులు చాలునే;

భువ—ఇంతకొంకగ ఎందుకోయొకో ఇన్నినాళ్ళు? మనోహరా!

జయ—స్వాంతమందున నీయెకమ్మిన వహ్నిరీతిగ నుండెకే.

భువ—చాలు చాలు ముఖస్తుతుల్. ప్రియా!

జయ— చాల నమ్మవె నానుడుల్;

భువ—వీలె నమ్మగ పూరుషాళిన్?

జయ— జేల! ఇట్లన న్యాయమా?

భువ—వీడనాడుట న్యాయమా నను?

జయ— వెఱ్ఱినై విడనాడితిన్;

జాలమేటికి నాదు నేరము సైచి ప్రోవవె నన్దయన్

భువ—ప్రాణవల్లభ! వ్యర్థమాయెను ఆఱునొక్కటి వర్షముల్;

జయ—చాన! మించినదానికిట్లు విచారమందుట కూడునా?

భువ—నేను భాగ్యవిహీనురాలను.

జయ— నేనె భాగ్యవిహీనుఁడన్;

భువ—నేను నేఁడుగ ధన్యనైతిని,

జయ— నీకృపారస మీయెడన్

మానినీమణి! చిల్కనావయి నన్ను ధన్యుని చేయవే.

భువ—తామెప్పుడు వత్తురో ఎప్పుడు నన్నాదరింతురో అని నాఁడు చెఱనున్నసీత శ్రీరామునికై పరితపించునట్లు మీకై వగచి వగచి కృశించుచున్నదానను. చిటికెనవ్రేలి ఉంగరము సీతకు కంకణమాయెననుమాట అతిశయోక్తి కాని నాయెడ అది స్వభావోక్తి అయ్యె. ఎన్నఁడు మీదర్శన బగునో ఎన్నఁడు మీసేవచేయు భాగ్యమబ్బునో అని తల్లడిల్లుచు మీపవిత్రనామ మంత్రమె జపించుచున్నదానను.

జయ—సతీవతంసమా! గతించినదానికి విచారించిన లాభమేమి? నల్లఁగలువల నల్లనమూడు నీకనులెట్టివాలు. ఏడువకుము
(కన్నులు తుడుచును)

భువ—రమణుఁడులేని రమణి యౌవనవిలాసనంపద యెడారిలోఁ గురిసిన వర్షమువలె నిరర్థకంబుగదా. లోకానంద సంధాయకంబగు పండువెన్నెల విరహిణులపాలిటఁ గార్చిచ్చై, ఉల్లమును రంజించు మల్లెలు మొల్లలు మున్నగు పూలు కఱగటమ్ముల్లై, అమృతరసభోజ్యపదార్థంబులు విషతుల్యంబులై బాధించును గదా!

జయ—నేను లేనపుడు నీవు బాధపడుట సహజమే కాని నీవుండియు నేనిపుడు బాధపడుచున్నాను. ఇందు కేమందువు?

భువ—మగవారు మిగుల మాటకారులు. వారితో మాటలాడ మాబోఁటి బోటులకు వాటమగునా?

జయ—పాపము! ఆఁడువాండ్రు పట్టిముద్దరాండ్రు; వారికి మాటలే రావు. పురుషు లోటికుండలవలె వాఁగుచుందురు. స్త్రీలు మాటయు మంచియు లేక చల్లఁగ గొంపలు తీయుచుందురు. అయినను,

ఉ॥ మాటలనేర్పియున్న, అసమానయశంబు ఘటిల్లు రచ్చలన్;
మాటలనేర్పియున్న, తనమాటయె ముందియొ చెడ్డ నెగ్గెడున్;
మాటలనేర్పియున్న, నలినాక్షుల చిత్తములన్ హరింపనౌ;
మాటలురానివాని కవమానము చేటును కల్గు నెల్లెడన్.

భువ—(నవ్వుచు) తక్కినవానిమాట కేమిగాని తమ మాటనేర్పుచే ఎందఱు సుందరుల డెందములు దొంగిలించినారో?

జయ—ఒక మాటనేర్పుననే కాక బహువిధముల అనేక కాంతామణు ల స్వాంతముల హరించితిని. చెప్పెద వినుము.

సీ॥ నగరాజమనుకాంత ♦ నానగుమోమును
కన్నార వీక్షించి ♦ నన్ను వలచె;

భువ—(తనలో) అది దిక్కుమాలిన ముండగానున్న నీ కోఁతి మొగ
ముఁను చూచి వలచునా?

జయ—నోరూరఁజేయు నా ♦ నూఁగుమీసలు చూచి
చంద్రిక యనురాచు ♦ జాబు లంపె;

భువ—(తనలో) వారమున కొకసారి కత్తిరించుచుండిన నూఁగు
మీసములు గానే అగపడును.

జయ—మణిమాలయను సఖీ♦మణి నాదురూపంబు
సొబ గెంచి రమ్మని ♦ కబురులంపె;

భువ—(తనలో) అహో! ఏమూరూపు! మొద్దులు మూటగట్టు
చున్నది.

జయ—నలినాక్షి యనునాతి ♦ నాదుమాటలనే ర్పు
రసి మెచ్చి నామీఁద ♦ రంగుపడియె;

భువ—(తనలో) తములపాకులరంగు కాఁబోలు!

జయ—నాదుసాహస ధైర్య బ♦లాదులు కని
కనక మనుకాంత నామీఁద ♦ కన్నువేసె;

భువ—(తనలో) నీ ధైర్యాదు లెవరెఱుఁగరు? నిలఁబడిన కలియఁ
బడుదువు; కలియఁ బడిన పాఱిపోదువు.

జయ—ఇంక, ఎందఱెందఱు నన్ను మోహించినారొ
తెలియఁ జెప్పిన ♦ బల్లున తెల్లవాఱు.

భువ—(తనలో) నోటిమాటకు కఱవాయని సిగ్గువిడిచి కోఁతలు
కోయుచున్నాఁడు. (పైకి) ఆలాగున చెప్పుదు. అంతమంది
మందయానలు మిమ్ము మోహించుటచేతనే నన్నింతవఱకు
విడిచిపెట్టినారు. వారిదగ్గఱకే వెళ్ళుఁడు.

జయ—అబ్బ! ఆమాట మఱి వదలవు కాబోలు? పెక్కుమంది
నన్ను ప్రేమించిరి. అందు నా తప్పేమున్నది? తుదకు నేనవ
రిని వలచి పెండ్లాడితినో నీకు తెలియదా?

భువ—పెండ్లికిని ప్రేమకును చాల భేదమున్నది.

జయ—నిజమే కాని నాకు అట్టి భేదమావంతయు లేకుసుమా.

భువ—కావలసినంత, ఆనాటి పెండ్లికిని, ఈనాటి ప్రేమకును ఏడు సంవత్సరములు భేదము.

జయ—ఎంత చమత్కారముగా మాటమాటకు నన్ను దెప్పుచున్నావు?

భువ—మిమ్ము మోహించిన మోహనాంగులలో మీకు నచ్చినది ఒకతైన లేదా? తామిపు డామెకడకు వెళ్ళియున్న, నాకు— పొరబాటు—మీకు ఈబాధ లేకుండుగదా? ఇప్పుడైన—

జయ—నీనిరుపమతనులతా సౌందర్యాతిశయమును చూచిన తరువాత నన్ను విడనాడిపోవుటకు కాళ్ళునచ్చునటే?

సీ॥ పున్నాగయాన! నీ ♦ ముద్దులుగారు మో
ము ఖిలసంకటవార ♦ ణాపి కాదె?
సారంగనయన! నో ♦ రూరంచు నీమోవి
సాటిలేని మధురా ♦ శయము కాదె?
భూపాలతనయ! నీ ♦ పొంగరు పెన్నద ఆహా!
వరపుణ్య మంగళ ♦ గిరియె కాదె?
ఓవరాళికచ! నీ ♦ యొప్పెదంబగు కౌను
మాయురే! నిజముగా ♦ మాయ కాదె?
తరుణి! నీదుపల్కులు పంచ ♦ దారలుగద;
అఖిలపుణ్య స్థలములు నీ ♦ యందెగలవు;
కాన నిను విడనాడి పో ♦ కాళ్ళురావు
అట్టి మురిపించి చంపకు అన్నుమిన్న!

భువ—మీముఖస్తుతులకు ఉప్పొంగిపోనను, కాను. 'నిన్నెపుడును విడువ' నని నాపై ఒట్టు పెట్టుకొనుడు.

జయ—ఆ! అలాగున ఏదో దారిచూపి నన్ను ఆదరింపుము. నీపరి నున్న నాప్రియమగు వస్తువులపై ఒట్టు పెట్టుకొనెదను.

చ॥ నెలఁతరో! ఎప్డునిన్నీడువ; నిక్కము; నీనగుమోముతోడు సూ
మెలఁతరో! నీకుమా పెవుకు మీరను; నీనునుమోవితోడు సూ
లలనరో! కన్నుసన్నల మెలంగెద, నీజిగిబుగ్గతోడు; వే
పలుకులవేల? నీమృదుపాదములాన; త్వదీయభృత్యుఁడన్.

భువ—(తప్పించుకొని, తనలో) అందుకుకూడ నీవు నాకు పనికిరావు.

జయ—ఎ తటక్కరి వొతటక్కరివే!

గీ॥ తీపిమాటల నను లోంగఁ ♦ దీసినావు;
చిఱునగవుల దాసుని గా నన్ ♦ చేసినావు;
సన్నలను ఆచేతిలో నను ♦ బఱిచినావు;
కాని, క్రియనున్నగా చేయఁ ♦ బూనకట!
భావయుగ్మంబు కాని యొండైన ♦ వంక పెరటి
కంగ భావకాఁ డనునట్లు ♦ చేసితబ!

కామిముక్తి (ము చముపైకూర్చుకును.)

భువ—(తనలో) వీని నట్టిబాధించిన విషమించును. చనువున విషము త్రాగింపవచ్చును; కాని బలిమిని పాలుత్రాగించుట కష్టము. (దగ్గరకుఁబోవును.)

జయ—(తనలో) ఈమెకు నాపై ప్రేమ లేకపోలేదు ఇపుడు నేను బిగువచేసెదను. (పైకి) ఏల దగ్గఱకు వచ్చెదవు? పొమ్ము. చంకను దుడ్డుకర్రగారిధి యుండు రిట్టిదే.

భువ—సతులనేమములు పతులు మన్నింపకున్న మఱెవరుమన్నింతురు

కమూచి—చావు!

జయ—ఎంతమాటకారివే - ఏగు మిచటినుండి వే;

భువ—పంతగింప న్యాయమా - పడఁతిపై మీగతిన్
(చేయి పట్టుకొనబోవును.)

జయ—(తప్పించుకొని)
చాలు చాలు; పోవె పో - జాణ! తెలిసెనీమది॥ ఎం॥

భువ—బేలచేయుతప్పుల - కేల యింతకోపము? ప॥

జయ—(చెంతకువచ్చి)

కోరి పిలిచి నప్పుడు - కొట్టు ఎక్కి నావుగా। ఎ॥

భువ—కోర నేల వేరే? ఈ - కొమ్మ నీసొత్తైగా। ప॥
(కౌగలించుకొనును)

జయ—(కౌగిలించుకొనును.)

వెంటనే తెర దిగును.

# తృతీయాంకము

ప్రథమరంగము అంతఃపుర బహిర్ద్వారము.

[జయంతుఁడు పరుండి యుండును]

భువ—(మెల్లఁగఁ బ్రవేశించి) అమ్మనాయనా? ఇంతసేపటికి కాయమ మందిరమునుండి తప్పించుకొని ఎక్కడ వ్యంకచప్పుఁడైన ద్వార పాలురు లేతురో అను భయంబున ఊపిరి బిగఁబట్టి పిల్లివలె మెల్లగ తడుచు తాఁకుచువచ్చితిని. కాళ్ళఁగల గజ్జెలందె లెక్కడ నాగుట్టు బైటఁబెట్టునోయని వానిని మీఁది కెగ ద్రోసితిని. నన్నెవరును పోల్చుకొనకుండ, నగలన్నియు తీసివేసి నాదాసిచీర కట్టుకొన్నాను. ఈమాఱువేషమున నన్నెవరు గురుతుపట్టగలరు?

జయం—(మేల్కొని యొడలువిఱిచి) ఉఁ, ఉఁ, ఉఁ, ఉఁ, (కాళ్ళు దగ్గఱగ ముడుచుకొని పరుండును.)

భువ—ఇంక నేమిభయము? నావగకానికడవు పోయిగావెళ్ళెదను. ఇక్కడ ఎవ్వరును లేరుకదా! (నలుప్రక్కలు చూచును.)

జయం—(తుల్లిపడి లేచి అఁ! ఏమిది? ఈకోటను కనిపెట్టుకొని యుండు బ్రహ్మరాక్షసి కాదుగదా! "ఇక్కడ ఎవ్వరును లేరు కదా!" అనుచున్నది. కంటఁబడిన నన్ను మ్రింగివేయును కాబోలు? ముసుఁగు పెట్టుకొని పరుండును.)

భువ—పిశాచములు వేఁటలాడు ఈయర్ధరాత్రమం దెవరుందురు? జార చోరులకే యీకాలము శుభకాలము.

జయం—(లేచి) నేను పొరబడిని. రాక్షసికాదు. కంఠధ్వనినిబట్టి స్త్రీయని తోఁచుచున్నది. అదిగో అక్కడ ఒక కామినీవిగ్రహ

మగపడుచున్నది ఈమె తోడులేక యీ యర్ధరాత్రమున
ఎక్కడకు పోవుచున్నదో కదా!

భువ—అక్కడ నాపెండ్లిమగఁడెలుఁగు గొడ్డువలె గుఱ్ఱుపట్టి నిద్ర
పోవుచున్నాఁడు. పాలలో కలిపి యిచ్చిన మత్తుమందు
బాగుగా పనిచేసినది కాని, శీఘ్రముగా వెళ్ళిరావలయు ఇప్ప
టికే చాల ఆలస్యమైనది.

జయం—(చెవులు మూసికొని) ఈమె జారిణి. ప్రక్కలోనున్న మగ
నిని మోసపుచ్చి జారుమగనితో సల్లాపములాడఁబోవుచు
న్నది! ఔరా! స్త్రీమహిమ! బుద్ధిలేని మగవాడు పెండ్లి!
పెండ్లి!! భార్య! భార్య!! అని కేయింబగళ్ళు వలవరింతురే
కాని స్త్రీల మాయావర్తంబు తెలిసికొనలేకున్నారు కదా!—
ఎవరింటిపిల్లో? ఎక్కడినుండి వచ్చుచున్నదో? జయపాలుని
భార్యయేమో. (లెంపలు కొట్టుకొని) హరీ! హరీ! పాపము
శమించును గాక! ఈమె ఎవ్వతెయో తెలిసికొనవలయును

భువ—హా! పాపపుదయ్యమా! ఏడుసంవత్సరంబులనుండి రానిమగని
నే డేల తీసికొనివచ్చినావు! శాత్రవులా మధురాపురముపైఁబడి
దాని నిర్మూలము చేసిన ఎంత బాగుగనుండును!

జయం—(ఆశ్చర్యముతో) ఏమి? ఏడేండ్లనుండియు ఈమెకు భర్త
సమాగమము కాలేదా? శాత్రవులు శ్రీమధురాపురరాజంబును
ధ్వంసము చేయవలెనా? (కోపముతో) ఓసీ! చండాలురాలా!
ఏమికూసితివి? (మరందుకుబోయి తగ్గి) తొందరపడరాదు. దీని
వృత్తాంతము తెలిసికొనవలయు.

భువ—ఓరీ! జయపాలా. కన్నాకళ్ళకు నీభార్య ఇచ్చుట నున్నదని జ్ఞాప
కము వచ్చినదా?

జయం—(తుళ్ళిపడి) నా అనుమానమే నిజమైనది ఆహా!

భువ—సయింటికివచ్చి నీతో కాపురము చేసెదననుకొనుచున్నావా?

వెఱ్ఱివాఁడా! నీ మోసమునకు తగుమోసము నేను చేయలేనా?
(పోవును)

జయం—ఇప్పుడు నేను వినినదియు కనినదియు స్వప్నమా! నిజమా! కాదు. స్వప్నము కాదు నా ప్రియమిత్రుని— గాలంకాడకున్నది ఓసీ! కులకళంకినీ! ఎంతపాపమున కొడిగట్టితివే! నిన్ను దూఱ వలసిన పనిలేదు నిన్నింతవఱకుఁ శోధించిచూడని నాచెలికానిదే తప్పు. ఔరా! కాలమహిమ ఎంతవిపరీతముగా ఉన్నది!

చ॥ కటకట! పక్కనున్నపతి కన్నులకుమ్మనుకొట్టి మెల్లఁగా
విటునిగృహాన కేగతిని వెళ్లుచునున్నదో అంగలాడి యి
క్కటికనిశీథమందు నుదిఁ గందక సిగ్గుభయంబులేక; ఎం
తటి తెగువైనఁ జేయుదురు నారులు; వారలనమ్మరాదుగా.

దీని ఱంకుమగఁడెవ్వఁడో కనిపెట్టవలయును (పోవును)

---

ద్వితీయరంగము - మేకరియిల్లు.

కరటకుఁడు—(పచారుచేయుచుఁ దనలో) ఈయాలపొద్దుట రాత్రి తప్పకుండా వత్తావని ఆనం నాసిముండ సేత కబురంపిందిగదా! ఇంకా రానేదేవి! (ఆలోచించి) నాలాంటి మొగుడింకెవడేనా దొక్కినాడు కావాల? లేకుంటే యింత ఆలస్యం ఎందుకవాల? ...రానీరానీ సూపిత్తాను నాతమాసా. నాకోపం యింకా దానికెఱిగనేదు, నేననలే పిచ్చిముండాకొడుకుని. గుండెల మీద కాలేసి యిలానొక్కేత్తాను రాజుకూతురైతే నాకేటి? నాను రమ్మని బతిమాలానా దాన్ని? కానీ కానీ! పులుసునోకి దుమ్ము నేకుండా తన్నేత్తాను. తగోతమాట సూసుకుందారి వత్తేవత్తాది; పోతేపోతాది. నాకేటి? దీని బాబుల్లాంటి ఆడోళ్ళు నామీద రంగొడ్డారు. (మీసము దువ్వుచు)

నాకు ముండకే లోటా? సైఁ అంతే డబ్బైపదకొంకుముంది పాగొత్తారు. ఆఁ! అందెలసవ్వడవుతోంది. వత్తున్నట్టు ది

భువ—(తలుపు కొట్టును)

కర—(తలుపుతీయును.)

భువ—(ప్రవేశించి కరటకుని కౌగలించుకొన బోవును)

కర—శాప్! దూరంగుండు. నన్నంటుకున్నావంటే నరుకేత్తాను ఓగుద్దుకి. సువార్.

భువ—(భయముతో) నీకింతకోపమెందుకువచ్చినది' నేనేమి తప్పు చేసినాను?

కర—తప్పూలేదు; గిప్పూలేదు నువ్వీమాయింటికి రానూ వొద్దు ఎల్లిపో! (గెంటివేయును)

భువ—నీకు వేయిదండములు పెట్టెదను. నా తప్పు క్షమింపుము.

కర—చీ! నంజా! ఈరోజూ చమించడమే? ఈయాల యెందుకింతా లస్యం శేశావ్? నిజం సెప్పు

జయం—(మెల్లగ ప్రవేశించి తనలో) ఎవరిదీయిల్లు? (కలయ జూచి) ఇది మేదరికొంప, ఆకొంకముత్రచ్చా దీని రసుకు! గీసిన పందిచందనమున నున్నాడు కంటికి నిబ్బరముగా కనబడుచున్నాడు. ఇతకు వలపురూపును, ఆకలిరుచియు, విచారింపవుకదా! (దాగియుండును.)

భువ—ఈవేళ కొంచెమాలస్యమైనది కారణము తరువాత చెప్పెదను.

కర—ఎవడిదగ్గిరకో ఎల్లొచ్చి ఆ స్యా అయిందతి బొంకుతా వాళ్ళ నిద్దరోకుండా కనిపెట్టు కుంది డానికి నీకున్నానా? అన్ని అబద్దాలే; అన్నీ అబద్దాలే. (చేతబట్టి కొట్టబోవును)

భువ—(తప్పించుకొనును.)

జయం—(తనలో) ఔరా! ఆగర్భ శ్రీమంతులాలగు రాజకుమారి అధముండగు మేదరివానిచే దెబ్బలు తినుచున్నది! కలలోకూడ ఇట్టి విచిత్రముజరుగునని ఎవ్వరు నూహింకవరుగదా!

గీ॥ విమలమాలతీలతా కావ ♦ రమున రేఁగు
నాశ్రయించిన మేను గా ♦ యంబుగాదె?
కుసుమకోమలి మొఱ్ఱని ♦ కూడెనేని
కాలితాఁపులు దక్క సౌ ♦ ఖ్యంబుకలదె?

మేదరయ్యా' గట్టిగా కాలితో తన్నుము చేతనైనకంతముక త్తరింపుము.

భువ—తనుటకు మంచిభక్ష్యములు తెచ్చితిని నీకక్కఱలేదా?

కర—(తనలో) అలాటోగాని దీనిమొగం నూసేప్పటికి నాకోప
మంతా పోయినది (పైకి) ఏఁయే?

భువ—ఇదిగో. (ఒడినుండి తీసియిచ్చును)

కర—(వెన్నుతట్టుచు సంతోషముతో) సెబాస్! నవ్వుసాలా మంచి
దానివేపిల్లా! నీమీద నాకు నిజంగా కోపం లేదుసుమా.

భువ—కోపము లేదా? మఱెందుకు నన్ను చేటతో కొట్టవచ్చినావు?

కర-నీకు నాదగ్గిర బయంవుందో లేదో సూద్దామని గమ్మతుచేశానె.నిజంగా
కోపంవత్తే కాల్తో తన్నేను? సెప్పూ? సివరికి నిన్నుకొట్టానా?

జయం—(తనలో) అహో ఏమా మేదరివాని రసికత! మాట
నేర్పు!! రసవంతమగు ఆంధ్రభాషావధూటికి లేనివంకలు
తెచ్చుచున్నారు. విశారదులగు పెద్దలింక బయలువెడలి
వీని కంపునోటినుండివచ్చు అపశబ్దములె సుశబ్దంబులని సభల
వాదించి ఆంధ్రభాష నుద్ధరింతురుగాక!

భువ—నేను తప్పించుకొనకున్న నాపాట్లేమగునో కదా!

కర—ఇంకెప్పుడూ అలాసెయ్యనేయే; రాయే; కూకుడోయే.

భువ—ఈమాటలకేమిక్కడకు! నీ అవసరముక్కు ఇట్లే అనుచుందువు?

కర—ఓసేటె! బెమ్మాండం బద్దలైపోయినట్లు చెప్తున్నావు? కొట్టనంతే
నమ్మాల; దా. (దగ్గఱకు వెళ్ళును.)

భువ—(ఒకమూలకు పోవును)

కర— తెమ్మాంగు - త్రిశగితి

సక్కాని సిన్నదాన - ఓ సన్నాని నడుముదాన!
సుక్కాల రాజుకన్న - బలె, సోకైన మొగముదాన॥

నీ, తియ్యనిమాటలు, తీరగుపాటలు-నీటులుగోటులు, నీ కేచెల్లును
రా నాచెంతకు, చాలు చాలు కోపము-
మానుమింక పంతము, రావె ముద్దులగుమ్మ॥ సఖా॥
రాయంచనడలదాన - ఓ, రాచవారి పిల్లదాన!
రావే లేవే చెలిజాణ - ఓ, రత్నాల నగలదాన!
నీ, కోపము మానవె, ముద్దొకటీయవె - కొట్టను తిట్టను ఎ॥
ఎప్పుడు కొట్టను- రా నా చెంతకు... సఖా॥
నీతోను మాటలాడ హా, నిన్నింతో ముద్దులాడ!
నీతోను సరసమాడ - నీముద్దుమోము చూడ!
నా, చిత్తము మిక్కిలి, కోరుచున్నది - చేయక జాలము, పం
తము మానుము! రా నాచెంతకు... సఖా॥

భువ—ఛీ! దూరముగా పొమ్ము.

కర— నీపాదలొట్టుకుంటానే. (పట్టుకొని) చమించే, చమించే
చమించే (లేచి) సరా? కోపం పోయిందా?

జయం—(తొంగిచూచి తనలో శివ! శివ! నా ప్రాణమిత్రుని భార్య
నొక అధముండు ముట్టుకొనుట చూడవలసివచ్చినది. చేవలేం
వానివలె ఊరకుండవలసివచ్చినది. ఛీ! ఎందుకీజన్మము?
(మఱుగుపడును.)

నాటకురంజి—ఆటతాళము

భువ—చాలు చాలు పోర- చాలు నీదుచెల్మి!
జాలమాయె ఇంటికినే- పో-యె దరా॥ చాలు॥

కర—ఎందుకింత కోపమే- ఏమి సేసినానె?!
సుందరీ! కోపముమాని, రా-రా-రా॥ ఎం॥

భువ— తప్పుచేయ లేదా?- తన్నరా లేదా
తప్పు తాగి ఉన్నావా? నే-రా-ను॥ చాలు॥

కర—అలుగుతావా? పిల్ల! ఆళ్ళమాడితేని।
అబ్బ! ఎంతజాణవే, హా-హా-హా॥ ఎం॥
భువ—ఔరా! మాయకాఁడ। హాస్య మాడినావా?
అబ్బ! ఎంతగడుసువు, ఔ-రా-ర! చాలు॥
కర—మాయ లోకమంత- మాయ నీవు నేను!
మాయకోప మెందుకే- ఒ-య్యా-రీ!॥ ఎంత॥
(చెయిపట్టుకొనును.)
భువ—(విడిపించుకొని) నేఁడు నామనసేమియు బాగులేదు; పోయెదను.
కర—ఏఁవేఁవే సెప్పు; నాతో సెప్పు.
భువ—నీతో చెప్పిన ఏమిలాభము? ఆర్చెదవా? తీర్చెదవా?
కర—ఆ ! ఆగుత్తానా ? తీరుత్తానా ? కోపంవత్తే ఆగ్గిబుగ్గిసేసేను ? (మీసము దువ్వుచు) నాతిమాసా నీకింకాయెరికినేదు. అగ్గిరావుణ్ణి.నీపానానికి నాపానం అడ్డు.

తెమ్మాంగు—మిశ్రగతి.

ఏమి ఏమి చెప్పఁగదే - ఎందుకిటుశేడ్చెదవు ? ఏమి॥
భువ—నామగండువచ్చెనయ్యో - నాకేమితోఁచదాయె॥ నా॥
కర—ఏమాస్సెను?
భువ— నిజంబుగానె
కర—ఎప్పుడొచ్చినాఁడె?
భువ— ఈదినంబుననే।
కర—పో, మాయాలాడి!
భువ— నీతోడనుమా
కర—అయ్యో! నామాట ?
భువ—ఆలోచింపు మాలోచింపు మాలోచింపుము॥ నామ॥
కర—రేపటికాణ్ణుంచి మాయింటికి రాకు. తెలిత్తే నాపానాలు పోతాయి. ఇంక నీకూ నాకూకల్దు- దండాలెడతాను. బేగెల్లిపో.

భువ—ఇంతేనా నీవు నాకు చేయు సాయము ?

కర—నానేఁవి సేసీది సెప్పా ?

భువ—మన సౌఖ్యంబున కడ్డువచ్చిన దుర్మార్గుని ఏమిచేసినను పాప మున్నదా ?

కర—ఆణ్ణిసంపేత్తే మనకే అడ్డూ ఉండదు.

భువ—మాటలచే ఏమిలాభము ? నీకింత ధైర్యము లేదుకదా !

కర—అమ్మాబాబూ ! నావొల్లకాదు. ఆమేడలో కేలాగెల్లడం ? దొక్కిపోతే సంపేత్తారు . .ఇదిగో! జేసైనకత్తితాను. మెల్లిగా మెల్లి దెబ్బకిసంపీ ఇందఁ (కత్తినిచ్చును.)

భువ—(పుచ్చుకొని) సరే. ఇప్పుడే వచ్చెదను మేలుకొనియుండుము (పోవును)

కర— బద్దంసుమీ. కత్తిజాగర్త.

జయం—ఔరా! ఎంతసాహసమెంతసాహసము! మగువలుమిగులతెగువరులు అందు భువనసుందరి రాచబిడ్డ; మీఁదుమిక్కిలిజారిణి ఇక సాహసంబున కేమితక్కువ? జారిణులకు పతి, సుతుడు తల్లి, తండ్రి యను విచక్షణలే, అభిమానము రవ్వంతయు నుండదుకదా! వారి కడ్డువచ్చువారిని గర్భశత్రువులుగ నెంచి చంపఁ బ్రయత్నింతురు (కోపముతో) ఔరా! వలువా! ముదిమిచే మతితప్పిన చిలువా! నలువా!

గీ॥ బురదలో పుట్టిన కమలము నను పుట్టి
నట్టి నీతల బురదకు పుట్టినిల్లు;
కాన మంచిచెడ్డల నెంచు జ్ఞాన మేని
కనికరంబేని నీకెట్టు కలుగు మూఢ

నాచెలికాని ప్రాణమునుతీయ, ఆజంకులాడిని సృజించినావా! ఆకులఁట మెట్లు వానిఁజంపి నీయుద్దేశము నెఱవేర్చునో చూచెద. (వడిగపోవును.) (తెరవాలును)

తృతీయరంగము-అంతఃపురము

(భువనసుందరి మెల్లగ ప్రవేశించును.)

భువ — కత్తి నొక మూలఁబెట్టి మెల్లగ మంచముకడకు వెళ్ళి జయపాలునిఁ బరీక్షించి తనతో వీడు గాఢనిద్రలో మునిఁగి ఒడలెఱుంగకున్నాఁ. నాపని చేసివేసెద. (కత్తిదీసి నఱుకఁబోవును.)

జయం — (లోపల) ఓసి! భర్తృసంహారిణీ! జారిణీ! ఆఁగుమాగుము.

భువ — (నఱికివేసి కత్తిక్రొక్కమూల బడవేయును)

జయం — (ప్రవేశించి) ఓసీ! భర్తృసంహారిణీ! జారిణీ! ఆఁగుమాఁగుము. (జయపాలుని చెంతకు వెళ్ళి చూచి మతిపోయి నిలఁబడిపోవును.)

భువ — (భయవిషాదముల మాటరాక జయుంతుని చూచుచుండును.)

జయం — (కోపముతో)

శా॥ ఓసీ! ఏమిది మేఁకవన్నె వృకమా! ఓ గోముఖ వ్యాఘ్రమా!,
ఓసీ జారిణీ! ధూర్తురాలు! కుమతీ! ఓ భర్తృవిద్వేషిణీ!
కాసంతేనియు సిగ్గులేక మగనిన్ ఖండించితే పాపినీ!
ఈసత్కృత్య భుజంగి నీయుసురు లిద్దే క్రోధమొ తెలుపుమా కాచుకో.

భువ — (శ్చర్య ముతోతనలో) వీఁడెవ్వఁడు? దేవతయా! దయ్యమా! (తెలివితెచ్చుకొని, ఓరక్షకభటులారా! రండురండు. నాభర్తను నెవ్వఁడో దుర్మార్గుఁడువచ్చి చంపివేసెఁగాడు. నన్నుఁగూడఁజంపనున్నాడుఁ రండు.

భటులు — (లోపల) అరే! అంతఃపురద్రోహి! నిలు నిలు. (ప్రవేశింతురు.)

ముభ — అరే! మందమతీ! వీరభటరక్షితంబగు యంతఃపురములోని కెట్లు రాఁగలిగితివిరా?

జయం — మీవంటి సోమరిపోతులు కావలియుండ, ఇందు జొచ్చుట కెవరికేని యేమి అభ్యంతరముండును? గంజాయి త్రాగి

మైమఱచి నిద్రించుచున్నవాఁడు ఈసౌధంబున జరుగుచున్న విపరీతంబు లేమి తెలియునురా ?

భువ—ఛీ! వదరుఁబోతా! నోరుమూసికొనుము లేకున్న పండ్లురాలఁ గొట్టించెదము.

రంభ—ఎవఁడవురా నీవు? నీయూరు పేరు లేమి?

జయం—అదంతయు నీ కేందుకు? నీపని నీవు చూచుకొనుము.

మో-భ—అరే! సాధువృత్తియున్న కిరాతా! నిష్కారణముగ రాజును మారుని చంపితి వేమిరా?

భువ— నామనోహారుని జంపి నామానభంగము చేయనలెనని తలంచినాఁడు.

జయం—(చెవులు మూసికొని)నారాయణ! నారాయణ!! (కోపముతో)

కమాచి-ఆటతాళము.

పాపత్మురాలా! ఛీ! ఛీ'- కోపమూఱ (దుంచెదర॥ పా॥
పాపమనక కల్లలాడెదే?- భర్తృసంహారిణీ॥ హారిణీ॥ పా॥
వానినిఁ నేనఁటేచంపితిఁ - వాచాలా! చాలునోర్మూసికో॥ పా॥

భువ—భటులారా! నోటికైపెఁ దన్నకింక జూచెదరేమి? నోటికి వచ్చి నట్లు కూయుచున్నాఁడు

జయం—అంకిలాఁడి బొంకఁగా చాలదా?- జంకెదె కులకలంకమా! బొంకఁగా॥

రం-భ—అరే? (పేలుడుగాయా! నడునడు (గెంటును.)

జయం—ఎక్కడకురా?

మో-భ—రాజుగారి ధర్మసత్రపు చెఱసాలకు. (లాగికొనిపోవుదురు)

భువ—పాఱిపోఁగలఁడు. భద్రము. మానాన్నగారితో చెప్పి వీనినిచిత్రవధ చేయించెద. (పోవును.)

(తెరవాలును.)

———

## తురీయరంగము—చావడి

[చంద్రశేఖరుఁడును కళాంకుఁడును ఆసీనులై యుందురు]

చంద్ర—మంత్రివరా! సకలశాస్త్ర విశారదులగు మీరును నాన్నగారును కలసి చేయుకార్యములందలి తప్పొప్పులెంచుటకు నాబుద్ధి చాలకున్నను, విన్న వైరాగికి విధింపఁబడిన దండన మతిక్రూరంబని నాకు తోఁచుచున్నది.

కళా—(మందహాసముతో) యువరాజా! బాలుఁడవగుటచే నీకాదురాత్మునకు విధించినశిక్ష కఠినముగా నగపడవచ్చును, కాని శాస్త్రసమ్మతమే.

చంద్ర—తప్పుచేసిన దేవతలైన నిందార్హులు, దండనార్హులు. కాని సృష్టికి నాయకమణియగు మానవవర్గంబున చేరిన ఒకని ప్రాణములను తీయుటకు రాజులకేమి అధికారమున్నది? అట్టుల చంపుటవలన కలుగు లాభమేమి?

కళా—ప్రజలపై దైవసమానుఁడు రాజు. శిష్టసంరక్షణంబును, దుష్టశిక్షణంబును, ఆయనకు విధి. ఇట్టి నరహంతకులు లోకసౌఖ్యనాశంబునకు హేతువులగుదురు. వారుండరాదు.

చంద్ర—మీరు చెప్పినది విశ్వసనీయమేయైనను, జీవహింసకు బదులుగా శాశ్వతకఠిన కారాగృహశిక్షవలన, నరహంతకు డెట్టివాడైన పశ్చాత్తాపము చెంది, ఇహసౌఖ్యంబులకు, పూర్తిగా చెడినను పరసౌఖ్యంబున కంతగా చెడఁడని నా యభిప్రాయము. దీనికేమి! కాని ఆతఁడు దోషియని మీరెట్లు నిర్ధారణము చేసితిరి?

కళా—భువనసుందరీ ద్వారపాలుని సాక్ష్యమునుబట్టి దోషియని రుజువైనది.

చంద్ర—నాకు నిర్దోషియని తోఁచుచున్నది.

కళా—ఏమి? ఆమహాపాతకుడు నిర్దోషియా? నీపలుకులు వింతగానున్నవే?

గీ॥ బాలుఁడవు; నీకు లోకాను ♦ భవము లేదు,
కాన, వానిపై వేషము ♦ గాంచి ప్రబసి
నేఁడ మా యెంచిఁడని యభి ♦ ప్రాయపడెదొ
అతివినయము ధూర్తుల చిహ్న ♦ మనఁగవినవె?

చంద్ర—మీరు సాక్ష్యమునుబట్టికదా వానిని దండించినారు. అది సరి కాదు. సాక్ష్య మొకమూలఁ బెట్టి, మన బుద్ధిబలము నుపయోగించి సత్యాసత్యముల పరిశీలింపవలయు. మీరట్లు చేయలేదు. ఇంతియేకాక భువనసుందరివట్టిదే. ఆమె నెప్పుడన్నలారా చూచినవారెవ్వరును లేరు మఱి ద్వారపాలకులా పరమ నీచులు; వారిని నమ్ముటకు వీలు లేదు.

కళా—అన్నలార ఆదుర్మార్గుని శయనగృహంబున చూచి పట్టుకొని నట్లు ద్వారపాలురు చెప్పుచున్నారే.

చంద్ర—ఛా! ఆనీచుల నమ్మరాదు. నేరగాని బట్టుకొనకున్న నాన్న గారు దండింతురను భయంబున దారిఁబోవుచున్నవానిఁ బట్టు కొని యుండవచ్చును. వారు పాపపుణ్యంబులాలోచింపక, దైవ భీతిలేక తాత్కాలిక సుఖంబునకై యెట్టి ద్రోహంబునైనను జంకక చేసెదరు. మఱి వాదాసాక్షుల డబ్బిచ్చియో భయ పెట్టియో తెచ్చిరి.

భటు—(ప్రవేశించి) మంత్రిశేఖరా! ఆజారగిని శిరచ్ఛేదము చేయ వలసిన కాలము సమీపించుచున్నది. దయచేయుడు.

చంద్ర—మంత్రిసత్తమా! నేఁడు వానిని జంపవలదు. రెండు దినంబుల వరకు ఆగుడు. ఇంతలో న్యాయాన్యాయంబు నేను పరిశీలించి చెదను. ఇందుకు నాన్నగారిని నే సెలవడిగెద.

కళా—సేవకా! యువరాజాజ్ఞయైనది రెండుదినంబు లాఁగుడు.

భటు—చిత్తము (పోవును)

కళా—చంద్రశేఖరా! నీవు వానియందింత యభిమానమెందులకు?

చంద్ర—అయ్యా! ధర్మమునకై దెబ్బలాడుచున్నాడనే కాని యభిమానముచే గాదు.

కం॥ నరపతి తెలిసియు తెలియకొ
పొరపా టొనరించినయెడ ♦ మోమోడక. ఆ
నెంసును జూపవలెఁ బతికిఁ
బరువడి; లేకున్న వాడు ♦ పాపాత్ముఁ డగున్.

మఱియొకమాట. భటరక్షితంబగు నంతఃపురములోని కాబైరాగి యెట్లు పోఁగలఁడు

కళా—అదియే నా కాచ్చర్యంబుగ నున్నది.

చంద్ర—దొంగతనముగా ఎట్లోలోనికి వెళ్ళెననుకొందము. వాఁడే చంపిన వాని దేహముపైగాని బట్టలపైఁగాని రక్తపు డాగొకటియు కానఁబడ దేమి?

కళా—చాల నేర్పుగా చంపినాఁడు.

చంద్ర—అట్లేయనుకొందము. వాఁడేల మాబావకై విచారింపవలె?

కళా—అదంతయు దొంగవేషము.

చంద్ర—మంచిది. నిన్నమీారు సభలో. నీవు జంపినట్లు రుజువైనది నీకేమి చెప్పకొనెదవు?" అని వాని నడిగినపుడు వాఁడేలమాట లాడఁడయ్యె?

కళా—ఏమిబొంకినను లాభము లేదని యూరకుండెను.

చంద్ర—అందుచే మౌన మర్ధాంగీకారమని శిక్షించినారు, అంతేనా?

కళా—అవును.

చంద్ర—వా! ఏమిన్యాయము? ఒకపక్షమువారి సాక్ష్యమునుబట్టి దండించుట మిక్కిలి అన్యాయము.

కళా—వాఁడు మాటలాడకున్న మేమేమి చేయఁగలము?

చంద్ర—చతురోపాయంబులచే వానిని మాటలాడించి, వాఁడేమి చెప్పనో విని, పిమ్మట తీర్పు చెప్పవలె. (లేచి) రండు; నేను

మాటాడించెదను. మొదట నాన్నగారికడకు వెళ్ళిన పిమ్మట చెఱసాలకుఁ బోవుదము.

కళా—మంచిది. (పోవుదురు.)

(తెర వ్రాలును.)

## పంచమరంగము - చెఱసాల

(జయంతుఁడు విచారించుచుండును)

జయం—(విచారముతో) ఔరా! విధాతా? దుర్గుణసంజాతా! ఎముకలు సున్నముగా నల్లు నీవు పాటుపడి చేసినసృష్టికి చెడపురుగై మృత్యువు నవయౌవనశోభితుల మింగివేయుచుండ, నీవు సత్యలోకంబున సౌఖ్యసరోవరంబున ప్రమోదకమలాసనుండవై మర్త్యలోకంబున జరుగుచున్న చిత్రవిచిత్రంబులను గాంచుచు వినోదించుచున్నావా! సిగ్గులేదా! నిన్నా మృత్యువెక్కడ మింగివేయునో యను భయంబున అశక్తులగు మానవులను దానికి బలియిచ్చుచున్నావా! పుత్రసంరక్షణార్థమై నిజప్రాణంబుల ధారవోయుట తల్లిదండ్రులకు సహజసద్గుణమై యుండ నీవేమిరా యిట్లు చేయుచున్నావు? ఓసీ! మృత్యువా! వేఁటకాఁడు మొత్తనేల? లేక మీఁదుకాళ్ళమీఁద బరువెత్తునను నట్లులా బ్రహ్మ జరాభరంబున అశక్తుండై యుండుటచే స్వేచ్ఛగా అచ్చువేసివిడిచిన ఆఁబోతురీతిని క్రుమ్మరుచున్నావా? కానిమ్ము. నూరుగొడ్లను తిన్నరాఁబందునకొక గాలివాన ఎన్నఁటికైన రాకమానునా? హా! వయస్యసత్తమా! జయపాలా. నన్ను విడిచిపెట్టిపోవుట నీకు ధర్మముకాదు సుమా!

ఉ॥ హా! సుగుణాలవాల! విబుధావళి సన్నుత సాధుశీల! అ
ప్పా! సువిచారలోల! జయపాల! నినున్ విడనాడలేక, స
న్న్యాసిగమాఱి నిన్ను వెనుకాడెడు నాపయిఁ గోపగించి, నన్
మోసముచేసి నేనుచేరఁబోలని చోటికిఁ బోయినాఁడవా?

ఎంతలో ఎంతవిపరీతము జరిగినది! చుట్టమని భార్యను జూడ రాఁగ మృత్యువై దిగమి్రంగెనుగదా!

సీ॥ ఏల పూఁదోట కా ♦ వేళను బోతిమి?
ఆతోత్తు రానేల ♦ యప్పుడటకు?
వచ్చెబో. ఇచ్చిన ♦ బహుమతిఁ గొనిపోక,
నన్నేల రమ్మని ♦ సన్న చేసె?
చేసిన, నేనేల ♦ సిగ్గులే కేగితి?
ఏగెను నన్నేల ♦ హితుఁడు కాంచె?
కని, అది యేమన్న ♦ దని నన్నడుగ నేల?
అంత, నాతో దెబ్బ ♦ లాడనేల?

గీ॥ అత్తవారింటి కతఁడేల ♦ అరుగుదెంచె?
ధవునిఁ జంప ఆజాణి ♦ తలఁపనేల?
అదియెఱింగిన నే వెను ♦ కై తినేల?
కటకటా! నొసటఁగల వ్రా ♦ ల్గడవఁదరమె?
(చంద్రశేఖరుఁడును, కళానందుఁడును ప్రవేశింతురు.)

చంద్ర—(మెల్లఁగా) అయ్యో! అతఁడు తనలో ఏమో అనుకొను చున్నాఁడు. ఇక్కడ మనము పొంచి వానిమాటలు విందుము.

జయం—నిష్కారణముగా జయపాలుఁడీపాడు దేశంబునకు బలియైనాఁడుగదా! యుద్ధభూమిలో ధర్మయుద్ధంబునగిట్టినను, మఱే దైన జబ్బువచ్చి చనిపోయిన నింత విచారముండదుకదా! ఒడలుమఱచి నిద్రపోవుచున్నపుడొక పిఱికిపంద వాని కంఠ ముత్తరించెనుగా! వాని సంరక్షణార్థమై నేను పోవ నన్ను పట్టుకొని నాపైని నింద నారోపించి, రాజు నాకు మరణదండ నము విధించినాఁడు. అక్కటా! కాలమెంత విపరీతముగా నున్నది! ఉపకారముచేయబోయిన అపకారము వెంటనే వచ్చుచున్నది.

చంద్ర—(మెల్లగా) వానిమాటలు జాగ్రత్తగ వినుచున్నారా?

కళా—(తల యూచును.)

జయం—(నిట్టూర్పు విడిచి) ఓరా! కలికాల మహిమ!

సీ॥ ధనికుఁడు కల్లలాడిన ♦ నిజమను దురు;
పేదవానిని నుడుల ♦ వినరు సభల;
మంచిపెద్దలు పరీ ♦ క్షించు ప్రభులు లేరు;
తిన్నఁగా నడచిన ♦ తిండి లేదు!
మేలొనరించిన ♦ కీడు వెంటనె వచ్చు;
నిజము చెప్పినఁ గల్గు ♦ నిష్ఠురంబు;
కాసువ కీజిహ్వ ♦ కల్ల లెన్నియొ పల్కు—
పాపాత్ములకు దైన ♦ బలము మెండు;

గీ॥ దానధర్మములఁ జేయ మా ♦ నంబు రాదు;
పరుల కొంపలు తీయఁగా ♦ వచ్చు చేయి
సజ్జనాళికి దైవంబు ♦ సాయపడఁడు;
న్యాయమేయూర వెదకినఁ ♦ గానబడదు.

చంద్ర— (ప్రకాశముగా) అరే ఎవఁడురా అక్కడ?

సేవ—యువరాజా! నమస్కారము ఏమిఆనుజ్ఞ?

చంద్ర—ఆనేరగాని పైకి తీసికొనిరమ్ము.

సేవ—చిత్తము (చెఱసాల తలుపుతీసి) ఓరా! పాపాత్మా! పైకి రమ్ము. యువరాజాజ్ఞయైనది.

జయం—నాప్రాణములు తీయ యువరాజా వచ్చెను? సరే. (పైకి వచ్చి నమస్కరించును.)

చంద్ర—నీ పాపపరిహారర్థము దేవుని ప్రార్థించుచున్నట్లున్నావే?

జయం—లేదు లేదు. దేవుని దూషించుచున్నాను.

చంద్ర—(నవ్వుచు) దేవుని దూషించుచున్నావా? ఎందుకు?

జయం—న్యాయాన్యాయంబులం బరికించు జ్ఞానము రాజుల కియ్య లేదని.

కళా—ఓసీ! వలుగాకీ! మారాజుగారిని నిందించుచున్నావా? నీ నాలుక చీల్చెద జాగ్రత్త

జయం—చావసిద్ధముగ నున్నవానికి సముద్రము మోకాలిలోతు కదా!

చంద్ర—మా నాన్నగారు నిన్నన్యాయముగా శిక్షించిరా? నాతో చెప్పుము.

జయం—చెప్పిన నేమిలాభము? కంఠశోషముతప్ప రవ్వంతయు ఫలము లేదు.

చంద్ర—నీవు నిర్దోషివైనట్లు రుజువు చేసితివేని నేను నిన్ను రక్షించెదను.

జయం—నిజమేనా? ఈమాటల నమ్మవచ్చునా?

చంద్ర—నిరభ్యంతరముగా నమ్మవచ్చును.

జయం—అట్లయిన నేను ఆపాతకిని నేటిరాత్రిగాని, రేపురాత్రిగాని పట్టియిచ్చెదను. యువరాజా! నావెంబడి వచ్చెదవా?

చంద్ర—తప్పక వచ్చెదను.

జయం—మఱొకమాట. ఒంటిగా నాతో రావలయును. వెంట నెవ్వరుండరాదు.

కళా—ఓరీ! రాజద్రోహీ! ఇపుడు చేసినపాపము చాలక ఈబాలుని కూడం జంప నెంచుచున్నావా? యువరాజా! వీనిమాటలు వింటివా? నీవొక్కడవే రాత్రిపూట వీనివెంట బోవలెనట వెళ్ళెదవు కాంబోలు?

చంద్ర—నేనొక్కడనే వెళ్ళెదను నాకేమిభయము?

గీ॥ వజ్రపుంజునుక ఎపుడైన ♦ బ్రద్దలగునె
మేటికొండయొక్కటి దాని ♦ మీదం బడిన?

అసమబలాశాలి నుదయించి • నట్టి నన్ను
చెఱపఁగలఁడె యీసింగన్న • సచివవర్య!

నీ యిష్టానుసారంబుగనే వచ్చెదను. సేవకా! వీని చెఱలో నుంచుము. మంత్రివర్యా! రండు. (పోవుదురు.)

(తెర వ్రాలును)

# చతుర్థాంకము

ప్రథమరంగము—భువనసుందరి మేడ.

(జయంతుఁడు చంద్రశేఖరునితోఁ బ్రవేశించును.)

చంద్ర—ఇక్కడికెందుకు నన్నుఁ దీసికొని వచ్చినావు? ఇది మా యక్షమందిరముగదా?

జయం—అయ్యా! నన్నేమియు అడుగవలదు. నేను చూపునదంతయు చూడుము; చెప్పినదంతయు చేయుము. రమ్ము మనమీమూల నిలఁబడి యింకను జరుగు చర్య చూతము. (ఒకమూల నిలుచుందురు)

భువ—(మేడపైనుండి నిచ్చెనగుండగా రెండుమెట్లు దిగును.)

జయం—(రాజకుమారకు వ్రేలితోఁ జూపును.)

చంద్ర—(ఆశ్చర్యముతోఁ దనలో) ఎవరది? మా యక్షమందిరము లోని కెట్లు వెళ్ళినది? (ముందుకు వడివడి నడుచును.)

జయం—(చేయిపట్టుకొని) ఇటురా. (లాగి) ఎక్కడకు వెళ్ళెదవు?

చంద్ర—ఆ నిచ్చెన లాగివేసిన అది క్రింద డబ్బునఁ బడును. వెంటనే దీనితో దానికంఠ మెగురవేసెద. అది భూతమేమో?

జయం—(ప్రక్కగా) మీయింటిభూతమే. (పైకి) ఇప్పుడే తెలియును. ఇక్కడనుండి కదలక చూచుచుండుము.

భువ—(క్రిందికిదిగి నలువంకలు చూచి ఝల్లుఁగ ముందుకునడచి నిలుచును.)

చంద్ర—(తనలో) ఈమె మా యక్ష ఎక్కడకు వెళ్ళుచున్నదో!

జయం—ఎవరో తెలిసిదా?

చంద్రి—తెలిసినది నాయక్కయే. పతివియోగదుఃఖము మాన్పుకొన లేక నీటిలోనో నిప్పులోనో పడుటకు వెళ్ళుచున్నది.

జయం—ఆఁ! అలాగునవా! అంతపతివ్రతయేమి?

చంద్రి—నిజము భర్తకై నిరాహారంబుబు మాని పట్టలేసి కోపంబున మునిఁగి యున్నది.

భువ—(మెల్లఁగ నడచుచు వెళ్ళిపోవును.)

జయం—అదిగో ఈ యర్ధరాత్రింబున పతిసేవ చేయుటకే వెళ్ళుచున్నది.

చంద్రి—(కోపముతో) ఏమి కూసినావు?

కం. ఔరా! నోటికి వచ్చిన
తీరునఁ గాఱు లఱచెదు మతిచెడెనె? తులువా!
మారాడితి వీ చీల్చెద
వారక నీజిహ్వఁ ఈ కృపాణము చేతన్.

జయం—అయ్యో! తొందరపడి నామీఁద నేల కోపపడెదవు? కొంచెము సేపోర్పుము. యథార్థస్థితి నీకే బోధపడును. త్వరగా రమ్ము. (పోవుదురు.)

(తెరపడును.)

---

ద్వితీయరంగము - మేదరియిల్లు.

[కరటకుఁడు పచారు చేయుచుండును.]

కర—(తనలో) అది ఉన్నే సంపేసిందంటగాని, ఒంటిగా రాత్తిరే వత్తా నని యీయాయారకీ [illegible] ఉండా పోయింది. రాక పోతే పోనాది? దాని సిగ్గోయ్యా. నాక తట్టుకోయింది కంద. అది రాజుగారికి దొక్కిందంటే నాపానాలు తీసేత్తారు. ఈకులో కెల్లామంటే బయంగుంది. మా లచ్చీ! నూకాలమ్మా! [illegible] డిలాంటిపన్లు చెయ్యను తల్లీ! బుద్దొచ్చింది. ఈ [illegible] తప్పు

నాను పరిగిల్లోపడితే నీకు వంచికొత్తిపోతుంది బతేత్తాను తప్పి!
నీకందుక్కి హాశ్వరబా యేసికం యిత్తాను.

భువ—(తలుపుకొట్టును.)

కర—(భయముతో దగ్గరలో) అమ్మబాబో! నన్నాట్టుకోడానికి బంటోతులు గావాల వొచ్చారు. ఏవి సేసేది?

భువ—(తలుపు గట్టిగా గొట్టును.)

కర—(మెల్లఁగా నడచి తలుపుసందులోనుంచి చూచి తనలో) ఎవల్లో తెలుకందున్నారి. ఎవలైతే నాకేమ్భయం? ఆకత్తి నాదికాదని బూకరించేత్తాను. మరేటి? సాచ్చివేఁటి? (పైకి) ఎవల్లాల్ళు?

భువ—నేను. తలుపు తీయుము.

కర—అమ్మనాయనా? నువ్వంటే? నంపేసిపోనావు(తలుపుతీసి)తలుపు గుద్దేటప్పటికి గుండె గుబేలుమన్నాది.

భువ—(ప్రవేశించి) నేనుండగా నీకేమిభయము?

కర—నీమీాదేబారం ఏఁసినానుగాని యేఁవి సేసినావేటి? వచ్చి సెప్పినావుగావు కబురంపినావుకావు. దా; కూకుడో. (కూర్చుండును.)

భువ—ఊరంతటికి తెలియఁగా నీకే తెలియదా? చిత్రముగా నున్నదే?

[జయంతి, చంద్రశేఖరులు ప్రవేశించి, ఒకమూల నిలుచుందురు]

చంద్ర—(ఆశ్చర్యముతో) ఇది మేదరికొంప. ఇక్కడకు మాయక్క రానేల?

జయం—(నాపైకిందాక గోడచివరావు) నేనవు డబ్లిలయనహలసి వచ్చినో యిప్పుడు బోధపడినదా?

కర—తెల్పిందిగాని గుండెలు లటుకూ లటుకూమంటున్నాయే. ఏఁవి శేశావు సెప్పు? [పైఁ జేయివేయును.)

చంద్రి—(కోపముతో) ఔరా! కామాంధా! ఏమి నీపొగరు?
(ముందుకు బోవును.)

జయం—(అడ్డుకొని) నిలు. ఎక్కడకు వెళ్ళెదవు?

చంద్రి—ఆయుధమాధముని హస్తములను తుత్తునియలు చేసెదను. వాఁడేడ? ఆమెయేడ? నా ట్టుకొనుటేడ? (ముందుకు నడచును.)

జయం—(పట్టుకొని) తొందరపడక జరుగునదంతయుఁ జూడుము.

చంద్రి—ఇంకను జూచునదియేమి? నన్ను విడువుము

జయం—నేను విడువను. నామాటవిని తిన్నఁగా జరుగునదంతయుఁ జూడుము.

భువ—మొన్నరాత్రి యిక్కడనుండి యింటికి వెళ్ళి మెల్లఁగా గదిలోకి బోయినాను. అక్కడనాయుగఁడు గాఢనిద్రలోనున్నాడు

జయం—వినుచున్నావా? తొందరపడక జాగ్రత్తగా వినుము.

భువ—అంత నీవిచ్చిన కత్తితో నొక దెబ్బకు వానిని మాతాతను జూడబంపినాను. కాని—

చంద్రి—(పండ్లు కొఱుకుచు) ఓసీ! ముందుకు నడచును.

జయం—(చంద్రశేఖరుని నోరుమూసి పట్టుకొని) ఊఁ. ఆగు.

కర—కాని అని పూరుకున్నావేఁవి? సెప్పే) పిల్లా!

చంద్రి—ఓసీ! క్షీరనిభ సత్కులకళంకినీ! జారిణీ! (ముందుకుఱుకును)

జయం—(పట్టుకొని కోపముతో) నిలు ఎంత చెప్పినను వినవేమి?

చంద్రి—ఆపాతకిపలుకులు నాచెవుల కలుగులై యంత పెట్టుచుండ నే నెట్లూరకుండఁగలను? విడు (విడిపించుకొనబోవును)

జయం—నేను విడువను.

చంద్రి—విడువుము.

జయం—విడువను

చంద్రి—నామాట విను.

జయం—నామాట విను.

చంద్ర—ఛీ!

జయం—చా! నేనుపడినకష్టము వ్యర్థము చేసెదవా? జాగ్రత్త ఇక్కడ ఇప్పుడు నీయిష్టము పనికిరాదు.

చంద్ర—నీ బుడిబుడిపలుకులకు జడియుటకీ చంద్రశేఖరుఁడు గాజులు తొడిగించుకొనలేదు. వదలుము.

జయం—నేను వదలను ముందడుగిడితివా మనపని చెడును ఓర్చి యుండి వినవలసిన దంతయు వినుము.

చంద్ర—ఈదుర్నయంబును జూచుచు అశక్తునివలె ఒకమూలఁబడి యుండమందువా? క్షత్రియధర్మమేనా?

జయం—ఇప్పు డట్లు చేయకతప్పదు.

చంద్ర—అయిన నాకీకత్తి యెందుకు? (కత్తినుద్దేశించి)

చ॥ అనుపమ ధైర్యసాహస బలాదులఁ గీర్తినిగన్న రాట్శిఖా
మణుల కరంబున న్నిలిచి మన్ననలందెడు శస్త్రరాజమా!
ఘనతర పాపకర్ములను గ్రక్కున ద్రుంపని నన్నుబోఁలు భీ
రునికడనున్న నీయశము రూపఱు;కావున, లేచిపోఁగదే!.

(కత్తి నేల బాఱవేయును.)

భువ—ఒక బైరాగి నాపడకటింటిలోనికి వచ్చినాఁడు. ఏలాగున వచ్చినాడో తెలియదు.

కర—(ఆత్రముతో) ఏటీ! బైరాగోడొచ్చాడా? నువ్వాణ్ని సంపీశం సూచాడా? సెప్పే.

భువ—ఆఁ. చూచినాఁడు.

కర—(గుండెలుకొట్టుకొనుచు) అమ్మబాబూ! నాకొంప నాగే పోనావే. అణ్నికూడ సంపేనేపోనావా?

భువ—నేనెందుకు చంపవలె? మా నాన్నగారితో చెప్పిచంపించినాను.

కర—మీబాబుకో యేటి సెపినావ్?

భువ—ఆబైరాగియే నామగనిని చంపినాడని చెప్పితిని. మహారాజుగారు నామాటలు నమ్మి వానికి మరణదండనము విధించిరి. ఈవేళ భటులు వానిని చంపివేసినారు.

కర—(సంతోషముతో వెన్నుతట్టుచు) శేస్. శేస్. మంచిగ మస్తాసు సేశావే. ఇంక మనకేం బయం నేదు.

చంద్ర—అరే. కామాంధా! ఏమి రాసిపొగరు? (వెళ్ళి మెడగొవ్వపై దన్నును)

కర—ఆ. ఎవ్వడాడు? (లేచును)

భువ—(తుళ్ళిపడి లేచి మూలడాగుకొనును)

కర—(చూచి పరుగిడబోవును.)

జయం—(పట్టుకొని) ఎక్కడకుపోయెదరా? నిలు. (కాలితో తన్ని ముందుకు త్రోయును)

చంద్ర—(గట్టిగా ఈల వేయును.)

భటులు—(ప్రవేశించి) యువరాజా! ఏమాజ్ఞ?

చంద్ర—వీనిని బట్టుకొనుడు. ఒక స్త్రీకూడ నిచ్చటనున్నది; వెదకుడు.

మొ-భ—ఆడుది ఎవతెరో యున్నదట! ఏదిరా చెప్పు. (అనును)

కర—ఆడదా? ఎక్కడిదీ? నేదే నానొక్కణ్ణే యిక్కడున్నాను.

రెం-భ—కల్లలాడెదవా? నిజము చెప్పుము (అనును)

కర—సో. సత్తెం. నా కెరుకినేదు బాబూ!

రెం-భ—ఇంక నదియేమాటా? గట్టిగా దగిలినగాని చెప్పవే (అనును.)

కర—సెప్తా. సెప్తా. అల్లా మూలనుంది

భటులు—(వెళ్ళి) మూలనూరుచావా? పైకిరా. (చేయిపట్టుకొని పైకి లాగి చూచి, విడిచి, ఆశ్చర్యముతో) ఈమె మారాజా కూతురు. ఇక్కడకేలాగున వచ్చినది?

చంద్ర—భటులారా! వీరిద్దఱును గొనిపోయి చెరనుంచుడు. అయ్యో! రండు; పోదము. (పోబోవును.)

భవ—తమ్ముడా! చంద్రశేఖరా! నా మానము తీసెదవా?

చంద్ర—ఓసీ కులటా! నీ వెక్కడి యక్కవు? నేనెక్కడితమ్ముడను? ఆసంబంధము నేటితో సరి. యౌవనమదంబున కన్నుగానక నీమానము నీవే తీసికొనినావు (పోవును)

జయుం—(చంద్రశేఖరుని వెంట బోవును.)

భటులు—(కంటకుని భువనసుందరిని తీసికొని పోవుదురు.)

(తెర వాలును)

---

తృతీయరంగము—రాజసభ

[సుదర్శనరాజు, కళానందుడు, చంద్రశేఖరుడు, కరటకుడు, భటులు నుందురు]

సుద—సుమంత్రివరా! ఏమిసమాచారములు? చిరంజీవి వెళ్లినకార్య మేమైనది?

కళా—దేవా! చిరంజీవి బాలుడయ్యు, తీక్ష్ణబుద్ధి గలవాడగుటచే కష్టపడి జయపాలుని జంపిన పాపిని పట్టుకొనినాడు.

సుద—ఏమా? జయపాలుని జంపిన దుర్మార్గుడాకపటతాపసికాడా?

కళా—కాడు. కాడు. పొరబడి మనము శిక్షించినారము కాని యతడు నిర్దోషియని తెలియవచ్చుచున్నది

సుద—అలాగునా? నా పుత్రులయుల్లుని జంపి నన్ను దుఃఖమున ముంచిన తెంపరి యేడీ?

(భువనసుందరియు, నాగనాటియు, భటులును ప్రవేశింతురు)

సుద—అమ్మా! నీవేల సభకు వచ్చినావు?

కళా—దేవా? ఈమెయే యాతని జంపినదని యువరాజు అభిప్రాయము.

సుద—(ఆశ్చర్యముతో) ఆ! ఏమీ? నాముద్దుకూతురు నాయల్లుని జంపినదా? ఛా! ఇవి యేమిమాటలు?

గీ॥ ధవుని రాకకై మిగుల నా ♦ తురంబుతోడ
దిన మెదురుచూచుచుందు నా ♦ యనుగు కూఁతు
రిట్టి ఘోరకృత్యము చేయ ♦ నెట్టులోను నె!
నమ్ముటకు వీలులేదు; నే ♦ నమ్మ జాల

చంద్ర—నాన్నగారూ! తామిప్పుడు న్యాయాన్యాయంబులు పరీక్షిపఁగ సింహాసనంబున నధివసించి యున్నారుగాని బంధుత్వము చూచుటకు కాదు. కనుక నేను చెప్పునదంతయు సావధానంబుగ కోపము మాని విని పిమ్మట మీ చిత్తానుసారంబున చేయ బ్రార్థించెద.

సుద—మంచిది. నీవేమి చెప్పెదవో చెప్పుము.

చంద్ర—చిత్తము. ముఖచిహ్నముఁబట్టి యాబైరాగి నిరపరాధియని నాకుఁ దోఁచుటచే రెండు దినంబుల వఱకు వానికి విధించిన మరణదండన మాపుఁడని మిమ్ము నేను వేఁడితిని గదా తర్వాత నేనును మంత్రిగారును గూడి వాని చెంతకుఁ బోయి మంచిమాటల నడుగఁగా జయపాలుని జంపిన ఘాతకుని జూపెదనని చెప్పినాఁడు. అందుకు నేనమ్మతించి నిన్నటిరాత్రి వానితోఁ గలసి యీమె మేడకడకు వెళ్ళితిని. అంతఁ గొంత సేపటికీమె నిచ్చెనమీఁదినుండి మేడ దిగినది.

సుద—రాత్రిపూఁట దొంగతనంబుగ నీమె మేడదిగుట కేమిపని యున్నది? సరిగాఁ జూచితివా? ఈమెయేనా?

చంద్ర—స్పష్టముగాఁ జూచినాఁడ ఈమెనే. పిమ్మట నీయధముని యింటఁదూఱినది. కనఁబడకుండ మేమీమెవెంటనే వెళ్ళితిమి.

సుద—(ఆశ్చర్యముతో) ఈమె జారియింటికా వెళ్ళినది! (కూఁతురు నుద్దేశించి)

గీ॥ రాణివాసంబు నందుండు ♦ రాచబిడ్డ!
వరుస గోల్పోయి నట్టి నీ ♦ ర్భాగ్యురాలు

ఆడ్డు రేయి మేకరియుంటె ♦ కనుగనేల?
పగవ్రు తీసితి దచె వా ♦ పాత్మ్రరాణా!

చంద్ర—నుకని నెట్లుల చంపినదో యీదుర్మార్గురాలితో జెప్పుచుండుట నేను చెవులార వినినాడ. ఈకట్ట యాసన్యాసికి దేయుటచే బావను గానసెంచి నాటిరాత్రి దీని వెంట వెళ్ళినాడు కాని వెనుకగుటచే నట్లు చేయక పోయె అంతట దనగుట్టు బయట బెట్టునోయను భయముచే నిదియా రేంబుతు వానిపై మోపినది. ఇది నాకు దెలిసినది.

సుద—ఓరీ! అధమాధమా! ఇపుడు చిరంజీవి చెప్పినదంత యు నిజమేనా?

కర—బాపబో! అనస్నీ పచ్చ బద్దాలు, నా కేమీ తెల్దు, నేరొట్టె కోసిని. ఆబంటో తులుకి బుట్టలూరికే ఇచ్చాను కానని నన్నొట్టున్నారు తరోత మీసిత్తం; నాభాగ్యం.

చంద్ర—కన్నులారా జూచి పట్టుకొనిన నా చెంతనే బొంకెదవా? ఈ కత్తి యెవరిది? (ఇచ్చును.)

కర—(పుచ్చుకొని చూచి) నాదా న్నాచే వుందిగాని నాది గాదు, అదెవరిళ్ళదో? (ఇచ్చివేయును.)

చంద్ర—నిజము చెప్పితివా నీకు శిక్షతగ్గును; లేనియెడల జచ్చెదవు ఆలోచించుకొనుము.

కర—(తనలో) సుంచునా గుంటే వున్నాడు గాని యెంతపని చేసినాడు నాకొంప తీసేసినాడు.

చంద్ర—మాటాడవేమిరా?

కర—సిరంజీవిబాబో! మరబద్ద మెందుకాడాలి? ఇన్నాళ్ళకి పాపం పండింది. ఆకత్తి నాదే; నానే యిచ్చాను

చంద్ర—వినుచున్నావా? అదినీయింటికెవానాళ్ళ నుంచివచ్చుచున్నది

కర—శానాళ్ళబట్టి వొత్తున్నాది. మాయింటికి రావొద్దు పోయే అంటే పోయేదికాదు. భూతంనాగొచ్చి మాయింటిమీద పడేది.

బాబూ! వచ్చినతరోత పొమ్మంటే బాగుండదని తలుపు తీసే వాణ్ని.

చంద్రి—మీరాయిద్దఱకును రాయభారములు నడుపుచుండు దుర్మతి యెవరు?

కర—ఈ దాసీనంజే బాబూ! ఎన్నివగలెట్టుకుంవో సూసు బాబూ. ఇలాంటిపన్లు సేసేకడించింది.

సుద—ఓసీ! దాసీముండా దీనికంతకు నీవా కారణము? (నఱుకబోవును)

చంద్ర—(అడ్డుకొని) శాంతింపుడు. ఏమే, వీఁడు చెప్పినది నిజమేనా?

సంగ—చెప్పినట్లు చేయకున్న ఈయమ్మ కేమికోపము వచ్చునోయని చేసితిని, క్షమింపుడు.

చంద్ర—నాన్నగారూ! దాస దాసీజనంబుల ప్రవర్తనను గూర్చి విచారింపక యిండ చేరనిచ్చుటవలన సత్కుటుంబము లనేకము లిట్లన కీర్తి పాలగుచున్నవి.

సుద—తక్కిన బానిసముండలకు బుద్ధివచ్చునట్లు దీనిముక్కు చెవులు కోసి యూరెల్ల వారము రోజులు త్రిప్పవలెను. ఓసీ సత్కుల కంటకమా! నాటివారితో నన్ను చిన్నపుచ్చితివి కదే దుర్మతీ!

కం॥ మేకులు మేనఁ గొట్టిన,
భీకరమృగపాళి వాతఁ బెట్టిన నిన్నుఁ గా,
నాకసి తీఱమి తీఱునె?
నాకపువు తెలుప జరించి నావఁటె? చెనటీ!

సుద—దీనికంతకుఁ గారకులు తామే.

[ఒక భటుఁడు జయంతుని దీసికొనివచ్చును]

సుద—[పండ్లు కొఱకుచు] ఓసీ! కులాటా! ఏమి పేలుచున్నావు? నీకు నేనా మేదరిమగనిఁ గట్టిపెట్టితినా?

వ—ఇంతవాఁక నన్నత్త వారింటికి పంపకుంట మీరా సేసప్పె.

సుకే— కమాచి — రూపకము

ఛీ! ఛీ! చాండాలిని! నా - చెంతనుండి లేచిపో;
ఛీ! ఛీ! మాటలుచెప్పెదో? - సిగ్గులేక యుం జాతిణి॥ ఛీ॥
జారత్వము చెల్లునే - సంసారి నారి కెటుల?
క్షీరవార్ధిం బోలుకులము - చెఱచినావు కర్మశి॥ ఛీ॥
ఏమి లోటువాని మఱగి - యింటిదాగని చంపెదో!
కామినీ! నిన్ను జీవముతో - కాల్చిన కోపమాఱదే॥ ఛీ॥

నాయనా! చిరంజీవి! నీ చిత్తానుసారంబుగా ఈ ద్రోహుల దండింపుము. దీని మొగము నేను చూడలేదు (పోవును)

చంద్ర—చిత్తము. మంత్రిసత్తమా! భువనసుందరికి శాశ్వత కఠిన కారాగృహశిక్షయు, మేదరివానికి పదేండ్లు కఠినశిక్షయు విధించితి. సన్యాసినిరపరాధి కావున వెంటనే విడిచివేయునది ఆర్యా! ఋషివర్యా! మిమ్మన్యాయముగా శిక్షించినందులకు మన్నింప ప్రార్థించెద. పొరపడుట మనుజనైజము. కష్టమునకు ఘాతకులను పట్టి యిచ్చినందుకు మీకనేక వందనములు. మఱి మీకేదేని కోరికయున్న తెలుపుడు.

జయం—యువరాజా! నేను కాశికి పోవుచున్నాను. కాన జయపాలుని అస్థుల నాకొసంగెదువేని వానినిగొనిపోయి గంగలో కలపెదను.

చంద్ర—చిత్తము. అలాగుననే యిచ్చెద. మంత్రివరా! ఆ ద్రోహుల భద్రముగ చెఱం బెట్టింపుడు.

కళా—అటులే చేసెద. భటులారా! వారిని గొనిపొండు (పోవును.)

భటులు—(భువనసుందరిని మేదరివానిని తీసికొని పోవుదురు.)

జయం—అయ్యా! రండు. (పోవుదురు)

(తెరవాలును.)

## తురీయరంగము - సాధోపరిభాగము

(జయంతుడు దుమ్ములమూటను పట్టుకొని ప్రవేశించును.)

జయం— (సతోషముతో తనలో) అహో! చంద్రశేఖరుఁడు నిజముగా ధర్మావతారమని చెప్పనొప్పు. ఏమి వానిబుద్ధికుశలత! ధైర్యము! సాహసము! భువనసుందరివంటి కుమార్తెలు నూఱుగురు పుట్టుటకంటె చంద్రశేఖరునిఁ బోలు బాలుఁ డొకఁడు చాలఁడా వంశ ముద్ధరించుటకు? అతఁ డడ్డుపడి నా ప్రాణములు రక్షించినాఁడు... హా! ఏ దుఃఖవచ్చిన సంతోషము? ప్రాణసఖుఁడు పోయినాఁడు గదా. వాని వెంబడి వచ్చియు, సర్వమెఱింగియు, వానిని గాపాడ లేకపోతినిగదా! ఈ దుమ్ముల సకలకలుషవిభంగ - అభంగ-గంగాతరంగిణిలో చేర్చి వాని ఋణము తీర్చుకొనెద. వారణాశికి పోయెద. పొట్టకై వీరిని వారిని ఆశ్రయింపనేల?

ఉ॥ ఎందఱో రాజు లీజగతి నేలిరి; ఎందఱో పోయినార, లిం
కెందఱో వచ్చువారు; కలఁడే స్థిరుఁడౌ నృపుఁడొక్కఁడేనియుఁ
ఎందును కష్టనష్టములె; ఇట్టి యనిత్యుల సేవ కొల్పనా?
పొందుగ నచ్యుతుంగొలిచి పొందెద నవ్యయ సౌఖ్యసంపదల్.

నా మంత్రిపదవి జయపాలునితోడనే పోయినది. మఱొక రాజుకడ మంత్రిపదము స్వీకరించి వానిని కొలుచుట యీజన్మమున నుండదు. ఇఁక నన్య దేశంబునకుఁబోయి యేదేని స్వల్పోద్యోగంబునకు ప్రయత్నింపవలె అందుకొక గొప్ప యుద్యోగిని ఆశ్రయించి అట్టముగడ్డు కఱువవలె. మఱి వాఁడు నీచుఁడైన,

సీ॥ దేవదేవ! మహాను ♦ భావ! నీ సాటివా
ర్భువిని లేరని వానిఁ ♦ బొగడవలయు;
కొట్టినఁ గసరినఁ ♦ దిట్టినఁ గెంటినఁ
దలవంచి పడియుండ ♦ వలయు నెప్డు;

దినము బాజాబుకుఁ ♦ జని కూరఁ దేవలె
  కాని యిచ్చిన, అణా ♦ కాని పెట్టి;
ఏడ్చుచు పిల్లల ♦ నెత్తుకొనవలయు;
  దిన మింటిచుట్టును ♦ తిరుగవలయు;
బాబుగారికయ సం ♦ పాదింప దిన మమ్మ
  గారిని సేవించి ♦ తీరవలయు;
గీ॥ నడుమ నడుమ లంచంబులు ♦ గట్టవలయు;
జ్ఞానమును చూచి పనులిచ్చు ♦ కాలమేగె;
అకట! గొప్పయింటను పుట్టి ♦ నట్టి నేను
చేయఁజాల నీపనుల; నేఁ ♦ జేయఁబోను.

ఒకవేళ సిగ్గువిడిచి ఆనీచకార్యంబులఁ జేసినను, దానఁగలుగు ఫలము స్థిరము కాదుగదా! కళ్ళుత్రిప్పినను గడుపునింపవలె అదియునుగాక ప్రతిరోజు చెమటలు కారునట్లు కష్టపడి ధన మెంత తెచ్చి యెంతగారాబముగా ఈశరీరమును పెంచినను తుదకు భూమిపాలేకదా.

చ॥ తనువొకగాలిబుట్ట; ఒగి దానికిఛిద్రముల నెన్ని చెక్కినన్,
కనకపుఁ బూత పూసినను, కష్టమెకాని ఫలంబు లేదుగా;
చనగనె ప్రాణవాయువులు చప్పునఁగూలెడు; అంతదానినిన్
కనుఁగొనరాఁడెవండు; కొఱగాదది అప్పుడు గ్రుడ్డిగవ్వకేన్.
కాన నస్థిరంబగు నీ దుష్కర్మల పంజరంబునకై బ్రతికెడు నాల్గు రోజు లేల వ్యర్థముచేయవలే? ఈచెంతనే యున్న మాయత్త వారి యూరికిఁబోయి నాభార్య యెట్టిగుణవంతురాలో తెలిసి కొని పిదప గాశీశ్వరుని పదసేవ చేయబోయెద. (పోవును.)

(తెరవ్రాలును)

పరిచయ రంగము—భానుమతి మందిరము.

(జయంతుఁడు కూర్చుండి యుండును.)

జయం—(తనలో) ప్రొద్దుట జరిగిన సంభాషణమునుబట్టి యీయిల్లు

నాయత్తవారిదని విశదంబైనది. ఆవృద్ధదంపతులు నాయత్త మామలు ఆపదునారేండ్లపసిడిబొమ్మ నాముద్దుగుమ్మ. ఆమె వయము, లజ్జ, మాటలు చూడ గుణసంపన్నురాలని తోచుచున్నది. స్త్రీస్వభావ మామె కన్నులంబట్టి చక్కగా గ్రహింపవచ్చును. కాని కొందఱు సుందరుల డెందంబులు నారికేళపాకంబులు. సులువుగాఁ గొనుకొఁబడవు. కనుకఁ బూర్తిగాఁ దఱిచి చూచిననఁగాని నాయనుమానము పోదు. అదిగో! వచ్చుచున్నది.

శ్రీరాగము - రూపకము.

శంకరా! రిపు హరా! - సజ్జన క్షేమంకరా!
శాంకరీ ప్రియకరా! - సర్వరా ద్బ్రాహ్మణా! ॥ శంక॥
బాలసుధాకర ధరా! - ఫాల నేత్రాకరా.
శూలభాసితకరా! - శీలకళ! పాపహర! శంక॥

(భానుమతి ఫలపుష్పంబులఁ బట్టుకొని ప్రవేశించును)

భాను—మహాత్మా! నమస్కారము, ఈఫలపుష్పంబు స్వీకరింపుడు.

జయ—శీఘ్రమే భర్తృప్రీమాస్పద వగుదువుగాక! (పుచ్చుకొని) నారీమణీ! కూర్చుండుము.
ధీర! గంగాధరా! - మేరుభూధరధరా!
సారసన్నుతపరా! - మార గర్వాపహార! ॥ శంక॥

(పూజచేసిపువ్వులుకొన్నితీసి) ఈపుష్పంబుల గైకొనుము (ఇచ్చును.)

భాను—(పుచ్చుకొని కన్నుల నద్దుకొనును.)

జయం—సందియ మెందులకు? తప్పులేదు. సిగలోఁ దుఱుముకొనుము:

కం॥ బలితపుసిగలో పూలున్
లలితంబగు నాసికంబు ♦ నగ ముంగరయున్,
చెలువగు కన్నులఁ గాటుక,
కలచో అందంబు హెచ్చు ♦ కాంతామణిరో!

భాను—(విచారముతో) నా కందమేందుకు? చందమెందుకు? ఎవరు చూచి యానందింపవలె?

జయ—ఏ ట్లనుచున్నావు? మొన్న మొన్న కన్నువిచ్చిన నీవింతవిరక్తిమార్గంబునఁ బడనేల?

భాను—మహానుభావా! మీకుఁ దెలియని దేముండును? పతివిసర్జిత కాంత జీవచ్ఛవంబుకదా. శవమునకు సింగారమేల?

జయం—ఆ! సద్గుణఖనివగు నిన్ను నీభర్త విడిచిపెట్టినాఁడా? పాపము! ఎంతపని జరిగినది? కారణమేమైయుండును?

భా.—కారణ మిదియని నాకుగాని నా తల్లిదండ్రులకుఁగాని నేఁటి వఱకు దెలియదు.

జయం—అలాగునా? వెఱ్ఱివాఁడు; వాఁడే వచ్చును లే తప్పులేదు; పూల నలంకరించుకొనుము.

భాను—మహాత్మా!

చ. కురులను దువ్వఁగాచనదు? కూర్పరగరామ శిగస్సుమంబు;లాభరణము లుంపరాదు; నెఱివస్త్రము కాటుకయొప్పు మూట్టఁగా సరివడ; దింకవీడియము సాంతరాన్నము నంటరాదు? స్త్రీవరు నెడబాసియున్నతఱి; ప్రాజ్ఞులు మీకిదిఁగ్రొత్త ధర్మమా?.

జయం—(తనలో) అబ్బో! పిట్ట చిన్నదైనను, కూఁత ఘనముగనున్నదే! నేనీ శ్రీరంగనీతులు విని మోసపోవు వాఁడనుగాను (పైకి) నిజమేకాని పసిపిల్లవగు నీ విప్పటినుండి పైనిర్బంధనలఁ దెచ్చి పెట్టుకొని కష్టపడనేల? ఔరా! దుర్మార్గుడా! ఎంత పొరపాటు చేసితివిరా?

భాను—మునివర్యా! ఆసన్మార్గునితోఁ గలసి సుఖింప నోచుకొనని యాదౌర్భాగ్యురాలిని నిందింపఁదగు? కాని యాయన నెందుకు నిందించెదరు? నేఁబుగాకున్న నన్నుఁ దలఁదన్ను కన్నెమిన్న నేతెచ్చితె వారి సేవ చేయుడు.

జయం— వెఱ్ఱిదానా! నిరుపమ సౌందర్యరాశివగు నిన్ను మంచిచేసి కొని సుఖింపక సిరి రానున్న మోఁకాలొడ్డు మూర్ఖుఁ వలె నిన్నుఁ ద్యజించిన నీమగఁడు నిర్భాగ్యుఁడు; కాని నీవు కావు. వాని పదసేవ చేయ నిన్ను మించుసుందరులు చ్చుటకల్ల; కాని జగన్మోహినివగు నీ విష్టపడిన, రాజాధిరాజులు బానిసీలై ని కన్నుసన్నల సంచరించెదరు.

భాను— ఋషిరాజా కడుపుఁజిచ్చు నార్పుకొనఁ దిరుగుచున్న కోడి, అమూల్య నవరత్నాభరణంబుల కంటె నొక కందిగింజను గొప్పగాఁ జూచునట్లు, మనోహరుని పదసేవ చేయఁ గోరు చున్న కలంతి, వాని కాలి గోటియొకనందు గారవం బఖండ మండలాధిపతుల యెడ నుంపదని మీ రెఱుంగరా?

జయం—(తనలో) ఈచెలి పలుకులు నా సందేహాంధకారంబును నిర్మూలము చేయుచున్నవి. మాటల కఱగున్యంబుగా మదియు, పనులు నన్ను నాభాగ్య మగణ్యంబుకదా! రూప వతియు గుణవతియు నగు కలకాంతను బాసి సన్యసించుటకు నేను పిచ్చివాఁడనా?

సీ॥ చక్రికిఁ గల దొక ♦ చక్రమే కాని, ఈ
కాంతకు రెండు చ ♦ క్రాలు గలవు;
శ్రీపతి కట్టెడు ♦ చేలమే కనక మీ
భామిని మేనెల్ల ♦ పసిఁడి ముద్ద;
శంభుండు తలనర్ధ ♦ చంద్రునిఁ దాల్చిన
నిండుచంద్రుఁడీమె ♦ యెడఁగలఁడు;
కంఠమందు విషంబు ♦ కలదు శంకరున కీ
చానకంఠమునసుధా ♦ సంకులంబు;

గీ॥ కనుక, ఈమెకు నన్నిట ♦ వెనుక వచ్చు
వారి నాశ్రయించుటచేత ♦ ఫలం లేదు;

నానేర మది యేమి?- నాతోడఁ జెప్ప రాదా?॥ ప్రా॥
ననుఁగూడ మీ వెనుకఁ- గొనిపో రాదె; నాథా!
చనునే కలసి నీ- సరణి నొల్లకుండుట?॥ ప్రా॥
ఎన్నఁడు దయ వచ్చునో - ఎప్పుడు వత్తువో యని,
ఎన్నుచుండ నేఁటితో-సున్నయయ్యె నాయాశ॥ ప్రా॥

జయం—కోమ్మా! విచారింపకుము. ముందు నాకు వాఁడెక్కడనైన గనఁబడిన పట్టి తీసికొనివచ్చి తప్పకుండ నీ కప్పఁజెప్పెదను. లోనికి పోదము రమ్ము (పోవుదురు)

(తెర పడును)

---

షష్ఠరంగము—చావడి.

[జయంతుఁడు పచారుచేయుచు నాలోచించుచుండును]

జయం—(తనలో) అకాంతమణి పైచేష్టలవలనఁ బరమ పతివ్రత వలె నగపడుచున్నది. కాని యంతరంగ మెట్టిదో తెలియకున్నది. తన మనసునకు మగఁడు నచ్చకున్నను, దరిద్రదశలో నున్నను, తల్లి జారిణియైనను; జారిణుల సహవాసముబ్బినను, భర్త యుపేక్షించినను, దేశాంతరగతుఁడైనను, తాను చాల కాలముప్రతీక్షచేయున్నను, ఇంటికిఁ దానేపెద్దయైనను, బాలవితంతువైనను సాధారణముగ స్త్రీజాతి రాత్రికైనను వ్యభిచారగుణ ముండు. అట్టిదాని నొక చిటికెలో పోల్చికొనవచ్చును.

చ॥ నగలు వయారపున్నడలు పల్లిగిలింపులు, మాటనేర్పులున్
ఎగదిగ నన్యపూరుషుల నెప్పుడుచూచుట, కోరచూపులన్
మగని నలక్ష్యపెట్టు, టను మానము లజ్జ భయంబువీడుటల్.
తెగువయు, పిల్లదంపు చిఱుతిండియు జారిణి కానవాళ్ళగున్.

కాని యిట్టి దుర్లక్షణంబులం దొక్కటియు నక్కలికికడఁ గానఁబడకున్నది. ఇంతకు, ఈపరీక్ష చాలదు. ఇంక రెండుమూఁడు

రోజులుండి, దాని నడతను కనిపెట్టవలయు. రాత్రినిద్ర రాకుండుటకు పగలు బాగుగా నిద్రపోతిని. ఏగోడమేడల దాటి భువనసుందరివలె ఏవిటకాని యింటికేగునో కనిపెట్టవలయు. ఈయుద్యానముచుట్టు పట్టిరాత్రియంతయుఁ దిరుగుచుండెద. (తిరుగుచు పినట నభినయించి) ఆ! నాయనుమానము నిజమగునట్లున్నది. మెల్లఁగ నెవ్వరో తలుపుతీసినట్లు చప్పుడైనది. (పోవును)

భాను —(మెల్లగవచ్చి తనలో విచారముతో) ఈరోజువఱకు నా భర్తనేడేవచ్చునో రేపేవచ్చునో యను నాశతో నెదురు చూచుచుంటిని గాని నాయుంటికి వచ్చిన మాఋషి నాప్రియుండు దేశభ్రష్టుండైనాడని చెప్పఁగానే నిరాశ చెందితిని. ఇన్నియేండ్లనుండి రాని మగఁడిఁక వచ్చునా? పట్టిది వెనుక కాళికా దేవిని సేవించిన నాకోరిక తీరునని ఆయోగిని చెప్పుటచే ఇంత దాక ఎట్లో ప్రాణంబులు నిల్పితి. కాని యింక నొకగడియయైన మనఁజాల. విచారభారమున నలిగి పోవుచున్నాను. ఎందైన బడి ప్రాణంబులు విడిచెదను.

జయం —(తొంగిచూచి తనలో) అదిగో! అక్కడ నిలఁబడి యేమో ఆలోచించుచున్నది.

భాను—(తనలో) ఆతాపసి యెక్కడ? (నలువైపులుచూచి) మునుల స్థిరచిత్తులు. వారి కాళ్ళొకచోట నిలువవు. ఎక్కడకో పోయినట్లున్నది. పోనిమ్ము. మంచిదే నాపని కెక్కడ అడ్డుపడునో యని భయపడితిని. జాగేల? పోయెద. (పోవును)

జయం —ఊఁ! నీప్రాణములఁ దీయనిదే నేనెక్కడకుఁబోను. ఔరా! దానిపై మెఱుంగులఁ గని నేను మోసపోతిని కాబోలు!... ఇంతకు ఎట్టి దారుణము చేయుటకు నిలుచున్నది. కానిమ్ము; ఇప్పుడంతయు తెలియఁగలదు (వెనుకగా పోవును.)

(తెరవ్రాలును)

---

# పంచమాంకము

## ప్రథమరంగము — కాళికాలయము.

(భానుమతి ప్రవేశించును)

భాను — ఓచండికా! త్రిలోకారాధ్యుండగు గంగాధరున కర్ధాంగి వనియు మహిషాసురానేకలోకభయంకరరాత్రించరాధములం జక్కడించి సాధుసంతతికి మహోపకారంబు గావించితి వనియు, భక్తజనుల పాలిటం జింతామణివయ్యు, నిను పేరాశతో నిన్నాశ్రయించినందుకు చాల సాయము చేసి గావు నావంటి బుద్ధిహీను లెందఱు నిన్నాశ్రయించి నిరాశచే ఉసుఱులు గోల్పోయిరో కదా! ఇంటిపేరు కస్తూరివారు ఇల్లెల్ల గబ్బిలంబులవాసనయను నార్యోక్తి నీయందు వ్యక్తమగుచున్నది. అమాయికుల బెదరించి పొట్టపోసికొను నీ వెక్కడ? దాసులను కాపాడు టెక్కడ?

గీ॥ గ్రామముల మీద జెలరేగి ♦ కరుణమాలి
యెనుములకు గోళ్ళ గొఱ్ఱెల ♦ జనులం బట్టి
కడుపు నిండ మెక్కంగ శక్తి ♦ గలదు కాని
శ్రితుల రక్షింప నీకెట్లు ♦ చేతగాదొ!

జయం — (ప్రవేశించి తనలో) ఔరా! ఏమి! దీని తెగువ! [illegible] ఈ దేవాలయంబున కర్ధరాత్రంబున నొంటిగ వచ్చి, యిటు కాళి రాకకై యెదురు చూచుచున్నది ఈజగజ్జనని ఖిలసంహారిణి కన్నులయందు వ్యభిచరించు స్త్రీయెంత సాహసి గాసై యుండవలె! కామాతురులకీజగమ్ము తృణప్రాయము [illegible] గాండెంత యందగాండో చూడవలె. (కత్తినుద్దేశించి)

జయం —(సంతోషముతో) దనలో సెబాస్! ఈచరితల మిన్న నాకర్థాంగియగుటచే నేను తరించినాడ. నాయనుమానమిప్పటికినిర్మూలమైనది. ఈమె నిజముగా పతివ్రత; మహాపతివ్రత: మహాపతివ్రత. ఇట్టిచో నిక్కడ నేనుండరాదు. దాసురాలియొక్క ప్రేమాతిశయముచే నీదేవి నన్నీ మొగఁ బట్టియిచ్చిన నాగుట్టు బట్టబయలగును. కాన బైకిఁబోయెద. (పోవును)

కాళి—గుణవతి! భానుమతీ? నీనేరంబులు మన్నించితి. నీకు నాయెడఁగల భక్తికి సంతసించితి. నీకేమి కావలెనో కోరుము.

శాంభ—శాంభవీ! దూరాలోచనము లేని యీ యబల యెట్టి కోర్కులఁ గోరవలెనో తెలియకున్నది.

కాళి—మంచిది. ఈ యుంగర మందుకొనుము. దీనివలన నీకు ముందు మంచి లాభము కలుగఁగలదు (ఇచ్చును.)

భాను—(పుచ్చుకొని కన్నుల నద్దుకొనును)

కాళి—భానుమతీ! ఇఁక నింటికి సుఖంబుగఁ బొమ్ము.

భాను—చిత్తము (పోవును)

జయ—(ప్రవేశించి) వా! పతివ్రతాశిరోమణీ! అగ్నిహోత్ర సమానులైనట్టి నీయందు మలిన ముండునని దురభిప్రాయపడిన యీ మూఢుని పాపము శమించుగాక! నిన్నింతకాల ముపేక్షించిన నాకిప్పటి కిప్పుడు బుద్ధివచ్చినది. నీవంటి సద్గుణఖనిని దుఃఖరూపంబునఁ ద్రోసి, సన్యసించిన తల్లిదండ్రులు గాఁ దపమాచరించినను, నరకప్రాప్తియే కాని మోక్షమబ్బదు. అమాయకురాలవగు నీకన్నిటి నెఱుఁగని నాతప్పు క్షమింప పాలంబును వేఁళ్ళతోఁ బెకలించివేయుదా? ఇపుడు నేనీ కాళికాలయంబునఁ దెల్లవారువఱకుండి, ఈదుస్తు మార్చివచ్చి, ఈనాభాగ్యలక్ష్మి భుజప జంబున హాయిగాఁ జేరి, దేవతలవలె నేనిట్లే

ప్రీతిం గొల్పు నా భాగ్యంపు ♦ రేఖ అదిగో;
లలితమై యొప్పు నా కృపా ♦ లక్ష్మి అదిగో

పాపము! సిగ్గుచే నిటునటుఁ గదలలేక ప్రయాసపడి నిలబడి పోయినది అందుచే విక్రమసింహునిఁ గొలిచిన బ్రాహ్మణుని ముందు ప్రవేశంబుగ నడ్డించి. పాపము చే దగ్గఱ నుండక మునుపే యున్న. ఆ రేడెట్లు కొట్టుమిట్టాడునో, అట్లే నా మనసిప్పుడు కొట్టుకొనుచున్నది. కాన జాగేల? నేనే యామెను బలుకరింతును. (దగ్గరకు వెళ్ళి) సుందరీ! నీసుందరముఖశరదిందుబింబము నిట్లేల దాచుకొనెదవు? నేను రాహువును గాను; భయపడ కెత్తుము. (ముఖము తిప్పుకొనును) అబ్బ! ఎప్పుడును లేని జంకిప్పుడు పుట్టుచున్నది చిత్రముగానున్నదే

భాను—(నవ్వుచు మొగము వంకరగా ద్రిప్పుకొనును)

జయం—నేను నట్టి పిఱికివాఁడనని యెంచి నవ్వుచున్నావా? నిజముగా నేను పిఱికివాఁడనే యైపోతిని. ఫలమేమి, నీవు నాకంటబడఁగానే నాధైర్యము పలుచనై చెమటరూపంబున పైకిపోవుచున్నది ఇంక నీవిట్లు బిగువు చూపుచు నన్నాదరింపవేని, నా ప్రాణవాయువులు కూడ ముక్కునుండి జారిపోకమానవు తరువాత నీవెంతవిచారించినను లాభములేదు.

(చెంతఁబోవును)

భాను—[మారుమొగముఁబోవును]

జయం—చెలీ! ఎందుకీ కోపము? నేనింతవఱకు నిన్నుఁజూచుటకు రా లేదనియా? సరే. అది నాతప్పే. నీచేతి కిప్పుడు చిక్కితి గదా. నీకోపముతీఱ నన్ను దండింపుము. నేను వద్దంటినా

సీ॥ నీకసితీఱఁ గెంపెదవి నా మది గొంకక నంట నొక్కవే;
పీకెదవు నీదు బాహులత బిగ్గఁజేరిచి తీయుమా యురిన్;
లేక, మదీయ వక్షమును నెట్టున కొట్టవె పూలబంతులన్;
ఈకమనీయపుం బడకటింటను నన్నిఁక ఖైదు చేయవే.

భాను—(నవ్వుచు) పాపము! మిమ్మింత శ్రమపెట్టుటకు నాకిష్టము లేదు. పైఁజెప్పిన కఠినశిక్షల దామము భరింపఁగలరా?

జయం—ఏమిచేయుదును? కష్టములువచ్చినపుడు భరింపక తీరునా?

భాను—మగవారు మిగుల సమర్థులు. బేలలగు మగువల మాటలచేఁ బొంగించి సఫలీకృత మనోరథు లగుదురు.

కాంబోది - రూపకము.

ఇన్నిరోజులకు నాపై - హృదయేశా! దయ వచ్చెనా?
కన్నులు కాయలు కాచెఁ - గాచికాచి మీరాకకై ॥ ఇన్ని
కాంతుఁ డవజ్ఞ చేసిన - కాంతజన్మము వ్యర్థము;
ఇంతకుఁగా మగవార - లెన్నఁగా స్వార్థపరుల్ ॥ ఇన్ని ॥
పనియున్నఁ దియ్యని - పల్కులు పల్కుచుందురు;
పని లేనప్పుడెంత - ప్రార్థించిన గారుగ ॥ ఇన్ని ॥

జయం—సుందరీ! క్రూరస్మరశరవారంబునకు గుఱినై కోపాగ్నిం బులతోఁ గాపాడుము వను నాశతో నిన్ను జేరితిని. శరణు తూరినవాని రక్షించుటకు బదులుగా, పరుషవాక్యాలంబుల నెత్తిపొడుచుట పతివ్రతకు ధర్మముకాదు సుమా.

భాను—నన్నెప్పుడు నీవు విడిచిపెట్టరు కదా? .

జయం—కాంతారత్నమా! వెనుకఁ దెలివితక్కువచేత నిన్నుపేక్షించినందుకు కిపుడు విచారించుచున్నాఁడ. కన్నులార నీసుందర రూపాతిశయంబులఁ జూచిన తరువాత నిను విడిచిపెట్టుటకు నేను మందమతినఁటె?

సీ॥ మోహనాంగిరో! నీదు ముద్దు మోమునుగన్న
 పాపంబు లన్నియు ♦ రూపు మాయు;
కామినీ! నీదు వాల్గన్నులఁ గాంచిన,
 వృద్ధున కైనను ♦ పిచ్చియెత్తు;
బోటిరో! నీదు కె ♦ మ్మోవిని చూచిన,
 ఎట్టి దిట్టకైయైన ♦ లొట్టలిడును;

భావినీ! నీ తను ♦ లావణ్య మరసిన,
వైరాగ్య మంతయు ♦ పాఱిపోవు
౩౨ భవ్య వాక్సుధలను జరా ♦ భరమూ తప్పు;
చెలిమి నబ్బిన రోగముల్ ♦ చేర వెపుడు;
ఈవు దయసేలు పుణ్యాత్మ ♦ నెన్న వశమె
బ్రహ్మకైనను మఱి వాని ♦ బాబుకైన?

భాను—'నిన్నెప్పుడు విడువ' నని నాచేతిలో చేయివేసి చెప్పుడు.

జయం—ఈ బొందిలో ప్రాణము లున్నంతవఱకు నిన్ను నేనువదలను.
(చేతిలోఁ జేయివేయును)

(ఒకరి నొకరు కౌఁగిలించుకొందురు.)

జయం—(భానుమతి నొక యాసనముపైఁ గూర్చుండఁజేసి తానొక దానిపై గూర్చుండి) కోమలీ! ఈమూటను భద్రము చేయుము. (ఇచ్చును.)

భాను—నాథా! ఇం దేమున్నది?

జయం—తరువాత చెప్పెదను.

భాను—చిత్తము. (ఒక మూలకుపోయి దాఁచి వచ్చును.)

జయం—సుందరీ! మఱేమి వింతలు?

భాను—(మందహాసముతో) మీకుఁ దెలియని వింతలే యున్నవి? నాక మిద్దెమీఁదివేళఁ గలికికొను లేని నన్నుఁ పెంత. (తములపాకు చిల్కలనిచ్చును.)

జయం—(అందుకొని వేసికొనుచు నవ్వును)

భాను—ఏల నవ్వుచున్నారు? నేను చుట్టిన చిలుకలు బాగుగా లేవా?

జయం—బాగుగా లేకేమి? రతిచేతి చిలుకలవలె నున్నవి. ఎట్టిధైర్య స్థైర్యాదులుగల పురుషుఁడైన స్త్రీ చేతికిఁజిక్కిన, ఈ తములపాకులవలె ఎటుమడిచిన అటు మడఁచియుండును గదా యని నవ్వువచ్చుచున్నది.

భాను—(నవ్వుచు) కాంతలు వలంతులు. కాంతలు లలంతులని కూడ మీయభిప్రాయమా?

జయ—అందుకు సందేహమేమి?

గీ॥ ప్రేమ యను సున్నమును రాచి, ♦ పిదప ధీర
తాదులను ప్రక్కయీనెల ♦ నన్నదీసి,
స్వేచ్ఛయను పెద్ద యీనె నా ♦ వెన్క లాగి,
పురుషుండనెడు తమలపాకుఁ ♦ బూవుఁబోండ్లు
మనసువచ్చిన తీరున ♦ మడఁచుచుందు్రు.

భాను—పాపము! పురుషు లెంతయ కూయకలు! ఇఁక మీరు నేను చెప్పినట్లే చేయుదురు కాఁబోలు?

జయం—అది ముందు తెలియఁగలదు (ఆకలు వేసికొనుచుండును)

జయ—(మూలనుండి పైకివచ్చి కన్నులు నలుపుకొనుచుఁ దనలో) ఇదేమి? మంచముపై నాప్రియుఁడు ప్రక్కలో పరున్న నేనుమూల కెట్లువచ్చితిని? నిద్రలో తూ్రిళ్ళి క్రిందఁబడితినా? ఆగయ్యాళి నన్ను క్రిందికి త్రోసి వేసినదా? (లేచిచూచి యాశ్చర్యముతో) ఔరా! ఏమి నాకలవర మా? కలగనుచున్నానా యేమి? (కన్నులు తుడుచుకొని చూచి) అక్కడ ఇద్దఱు మాటలాడుచున్నట్లున్నదే. అ దొకతె నాభార్య మిగిలిన మానసి యెవరు?...
ఓసీ! పిశాచమా! ఇంటిమగనిఁ గ్రిందికిత్రోసి వేసి అంకుమగనితో హాయిగా సరసమాడుచున్నావా? నాకన్నుల దుమ్ముగొట్టితివా? ఔరా! కామాంధా! నీభార్యతో తృప్తినొందక యీ యెంగిలి పదార్థంబునకాశపడి కుక్కవలె చచ్చుటకా వచ్చితివి? కాచుకో (కత్తితీసి) పరదారకాంక్షగల నీకుఁ దగు కాన్క యిదే కైకొనుము. (పొడిచివేయును.)

జయం—హా! చచ్చితి. (నేలఁబడి ప్రాణములు విడుచును.)

భాను—(త్రుళ్ళిపడి లేచి) ఎవఁడవురా నీవు? ఇక్కడ కెందుకు వచ్చితివి?

జయం — నీకన్నులింక నెత్తిమీఁదికి వచ్చెనవా? నే నెవఁడనో యెఱుంగవా? నీయింటిమగఁడను.

భాను — ఛీ! మూర్ఖా! నోరుమూసికొనుము. లేనిచో పండ్లురాల గొట్టించెదను.

జయ — ఆఁ! ఏమి పేలుచున్నావు? (దగ్గఱకు పోవును.)

భాను — (బిగ్గరగా) నాథా! నన్నెవ్వఁడో చంపవచ్చుచున్నాఁడు. కాపాడుఁడు. లెండు లెండు (పైబడి యిటునటు కదిపి చూచి) హా! నాథా! (జయపాలు నుద్దేశించి) ఓరీ! మహాపాతకి! ఈయన నీకేమి యపకారము చేసెనురా? (లేచి) అమ్మో! అమ్మో! చెలులారా! నాపతి నెవఁడో క్రూరుఁడు చంపివేసినాఁడు రండు, రండు. [ఇటునటుఁ బరుగెత్తును.)

జయ — (నిదానించిచూచి యాశ్చర్యముతో) ఈకాంత యెవరు? నా భార్య కాదే. ఈమందిరముకూడఁ గ్రొత్తగాఁ గనబడుచున్నది. నేనిచ్చటి కెట్లు వచ్చితిని? (పైకి) అమ్మా! నమస్కారము. నాతప్పు క్షమింపుము. నీ వెవ్వవు?

భాను — నేను సత్యసంధుని కుమార్తెను; సుమంతుని కోడలను

జయ — (ఆత్రముతో) ఏమి? సుమంతుని కోడలవా? ఆయన దేయూరు? ఏమి యుద్యోగము?

భాను — మధుపురాధీశ్వరుఁడగు ధనపాలునిమంత్రి ఆయనకుమారు డీయన.

జయ — సుమంతుని కుమారుఁడు జయంతుఁడా యితఁడు?

భాను — అవును, ఆయనే, హా! ప్రాణేశ్వరా! (మూర్ఛిల్లును.)

జయం — అయ్యయ్యో! నాజయంతుఁడే రా? (కత్తి నేలబార వేసి దగ్గఱకువెళ్ళి చూచి) హా! జయంతా! జయంతా!! (చతికిలఁబడి) హా! హతవిధీ! నాచే నాప్రాణమిత్రుని చంపించితివా!

సీ॥ అన్నదమ్ములరీతి • అరమర లేకుండ,
పిన్నఁటనుండియు • పెరిగినాము;

ఒకకంచమందున ♦ ఒకమంచమందున
భుజియించి నిద్దుర ♦ పోయినాము;
ఒకపాఠశాలలో ♦ ఒక్క గురుని యొద్ద
శ్రీకరకళ లభ్య ♦ సించినాము;
రామలక్ష్మణులట్టు ♦ లే మంచిచెడ్డల
ఎడఁబాటు లేకుండ ♦ మెలఁగినాము;

గీ॥ నాఁడు నీతిచెడి నిను దూల ♦ నాడ, అలిగి
పాఱిపోతివో నన్నుఁబాసి ♦ ప్రాణసఖుఁడ!
అక్కటక్కటా! దుఃఖాబ్ధి ♦ యందు నన్ను
ముంచి బాధింప నీవస్త ♦ మించినావె?

హా! గుణవంతా! జయంతా! కలనైన, ఇంతఘోరము జరుగు నని మన మనుకొనలేదుగదా. నిన్నన్యాయముగా నిందించిన దుష్టు నే నెంతయో చింతించి, సాధ్యమగునంత త్వరలో నిన్ను క్షమాపణ కోరుకొన నాతురపడుచుంటినే! ఇఁక ఎవరిని క్షమాపణ కోరుదును? నిన్ను వెదకి యెందుఁబోదును? హా! నేస్తమా! మా పిల్లఁడేడని నీ దల్లిదండ్రులును, నీ మిత్రుఁడు జయంతుఁడేడని పౌరులును, నన్నడిగిన నేనేమని చెప్పుదును? ఈ మహాపాప మెట్లు భరింతును? ఇదితప్పుట కేమొనరింతును?

భాను—నీ వెవరవు? ఇక్కడ కెట్లు వచ్చితివి?

జయ—సాధ్వీరత్నమా! నేను ధనపాలుని కుమారుఁడ. మహాపాతకుఁడ. జయపాలుఁడ. ఇక్కడ కెట్లు వచ్చితినో నాకును తెలియదు,

భాను—హా! మనోహరా!

హిందూస్థానీ భైరవి—ఏకతాళము.

నను విడిచి పోతివే - నా ముద్దుధనమా!
వినుమే నీ వెంటనే - వేడ్కతో వచ్చెదను! నను॥
చేతికిఁ జిక్కినమణి - చేజాఱిపోయినది;

నాతలవ్రాఁత? లేక - నాకొఱనోముఫలమా॥ నను॥
పతి చెంతనే యుంకుట - నశికి విధి కావున
కొత్తకక నకుఁగూడఁ – గొనిపోంను; వచ్చెద॥ నను॥

(జయంతునికంఠము చేతితోఁ నడుముచుఁ దనలో) ఇదేమి? ఇంతవఱకు రక్తముతోఁ దడిసియున్నగళము మునుపటివలెనే గాయమే లేనట్లగపడుచున్నది. బాష్పపూరితంబులగు నా కన్నులు పొరఁబడుచున్నవి. (పైటకొంగుతోఁ గన్నులనద్దుకొని చూచి సంతోషముతో) నిజముగా గాయమే లేదు ఏమి వింత! (చేతులుచూచుకొని) ఆఁ! తెలిసినది జగదంబ ప్రసాదించిన యుంగరపు ప్రభావమే యిది. (సంతోషముతో) నాథా! నాథా!!

జయం — ఉఁ! అబ్బ! ఏమే! (ఒ త్తిగిలి పరుండును.)

జయ — (తనలో) ఛీ! నిష్కారణముగ ప్రాణసఖునిజంపి యేమొగముతో బ్రతికియుందును?

గీ॥ కడుపుమంటను త త హ • పడుము దృష్టి
పోవ, కనిపగుడ్లను మింగు భు • జ గిభంగి;
కోపమున మైమఱచి దృష్టిఁ • గోలుపోయి,
ప్రాణమిత్రుని చంపితి • అకట కట?

మిత్రరత్నమా! ఇదిగో నేనుకూడ నీకడకువచ్చుచున్నాఁడ. (క త్తి తీసి నఱకుకొనఁబోవును.)

భాను — రాజకుమారా! తొందరపడకుము. నీసఖుఁడు సజీవుఁడై యుండ, నీవు ప్రాణత్యాగమేల చేసికొనెదవు?

జయ — నాచెలికాఁడు బ్రతికియేయున్నాఁడా? నీకు మతిపోయినది; పొమ్ము నాపని కడ్డురాకుము.

భాను — నిజముగా నేను బ్రతికించితిని.

జయ — నీవు చనిపోయినమగని సావిత్రివలె బ్రతికించితివా? పోపో, వెంగలీ! ఎట్లుబ్రతికించితివి?

భాను—వెనుక దుర్గ నాకు ప్రత్యక్షమై యీయమృతపుటుంగరము నిచ్చి దీన నాకు మంచిలాభము కలుగునని చెప్పినది. ఇపుడు నేను నాభర్తకైబడి యేడ్చుచుండ, ఈయుంగర మాయన కంఠమునకుఁ దగులుటచేఁ బునర్జీవితుఁడయ్యె!

జయ—అలాగుననా! ఏదీ? లేవుము.

భాను—మంచిది. నాధా! లెండులెండు. మీమిత్రుఁడు జయపాలుడు వచ్చెను.

జయం—(దిగ్గున లేచి) నామిత్రుఁడు జయపాలుఁడు భూతమై వచ్చి నిన్ను బాధించుచున్నాఁడా?

జయ—(ఆశ్చర్యముతో) ఔరా! ఏ మీవిపరీతము! హా! పతివ్రతారత్నమా!

భాను—నన్ను బాధించుట లేదు. మిమ్ము చంపి వేసినాఁడు.

జయం—నన్ను చంపి వేసినాఁడ! వెఱ్ఱిపిల్లా! కలగనుచున్నావు. నేను బ్రతికియున్నాఁడ [illegible]; పరుండుము.

భాను—నేను కలకనుట లేదు. మీకు నామాటలనమ్మకము లేకున్న అటు చూడుము. (చూపును)

జయం—(చూచి యాశ్చర్యముతో) ఇదేమి? సఖా! పామువలె పగఁబట్టి చచ్చియు నిర్దోషినగు నన్ను బాధింప భూతమైతివా?

జయ—హా! జయంతా! ఎన్నాళ్ళకు నాకంటఁబడితివి? (దగ్గఱకు వెళ్ళును.)

జయం—ఆఁ! ఆఁ! ఆఁ! (వెనుకకుఁదగ్గి) సుందరీ! చూచెదవేమి? కృపాణ మందుకొనుము (పరుగిడును)

జయ—(వెంటఁబడి) ఏమట్లు భయపడుచున్నావు? నీమిత్రుఁడ జయపాలుఁడనుగాని భూతమునుగాను (కత్తిపాఱవేసి) ఇఁక నీభయము తీఱినదా?

జయం—కన్నులార నీచావును జూచిన నన్నే బూకరించెదవా?

జను—చాల బాగున్నదే. చనిపోయినవాడవు నీవుకాని నేను
కాను. నిన్నీ కత్తితో పొడిచి చంపితిని. కత్తి రక్తముతో నిండి
యున్నది; చూడుము. (కత్తితీసి చూపును.)

జయ—ఏమి యీమాయ? నళినాక్షునె నీతో మాటలాడుచున్న
నన్ను నీవు చంపితివా? చంపిన నేను బ్రతుకుటెట్లు?

జయ—ఆఁ ఆలాగున కాదికిరమ్ము సాధ్వీ తల్లమగు నీ సతి గౌరీప్రసా
దంబున లభించిన అమృతపుటుంగరముచే నన్ను బ్రతికించినది.

జయం—సుందరీ! నిజముగా నన్నితఁడు చంపెనా? నీవు నన్ను
బ్రతికించితివా? ఆయుంగరమేదీ?

భాను—అప్పనప్పను. ఇదిగో యుంగరము. (చూపును)

జయం—(వెన్ను చఱచుచు) సెబాస్! కాంతా! సెబాస్! (జయ
పాలుతో) నీవెట్లు బతికివావు?

జయ—నేను చనిపోయినదా? నీవట్లనుమానించుటకు?

జయం—ఇది బాగుగానున్నది. నీవెఁగున మేదరవాని మఱఁగి నాటి
రాత్రి నన్ను వాని పాత్రెల్సాకంబునఁ జంపివేయ, బైరాగి
వేషమున నీవెటవచ్చి నేను నీయెముకల గంగలోఁ గలుప
దీసికొని వచ్చితిని.

జయ—సరే. నీవిపుడు చెప్పిన దంతయు నిజమనుకొందము. ఏవీ?
నా దుమ్ములు చూపుము.

జయం—ఇదిగో చూపెదను సుందరి! మూటఏదీ?

భాను—ఆమూలఁ బెట్టినాను

జయం—(వెళ్ళి మూటవిప్పి వెవెలబోవుచుఁ దనలో) ఏమైనవి?

జయ—(నవ్వుచు) అధర్మపత్నీ పరిభాగంబున బతికితివే కాని నీకిం
కను తెలివి బాగుగా రాలేదు. ఎందుచేఁ బలవరించుచున్నావు!

జయం—ఈ చేతులతో నిదుమ్ములెత్తి తెచ్చిన నన్ను భ్రమింపఁ
జేసెదవా? (ఆలోచించి) ఆఁ! మాట. నిజము చెప్పుము. నే
నీగదిలోని కేదెన మూట తెచ్చితినా లేదా?

భాను — తెచ్చినారు. నాచేతికి దాచుమని ఇచ్చినారు

జయం — ఆ! అవునవును. నీవు దానినెక్కడ పెట్టినావు?

భాను — ఆమూలఁ బెట్టినాను.

జయ — ఆమూటయందేమున్నదో నీ వెఱుంగుదువా?

జయం — సతీమణీ! జంకెందుకు? చెప్పుము. నేనేమియు అనను లే.

భాను — అందు మనుజుని అస్థులున్నవి.

జయ — నీకెట్లు తెలియును? ని కీతఁడు చూపినాఁడా?

భాను — (జయంతునితో) నాథా! మీమాట మీఱినందుకు క్షమింపుఁడు. (జయపాలునితో) అయ్యా! ఈయన ఆమూటయందేమున్నదో చెప్పకుండ దాచుమని నాకిచ్చుటచే, అందేమి యున్నదో చూడవలెనని ఆమూలకు వెళ్ళి మూటవిప్పి చేయి పెట్టఁగానే దుమ్ములు తగిలినవి. నేనందుల కాశ్చర్యపడి యప్పటియట్లె కట్టి పెట్టివేసితిని.

జయం — (సంతోషముతో) ఆఁ! తెలిసినది వయస్యసత్తమా! ఈమె యూర్మిక ప్రభావమున నే నెట్లు బ్రతికితినో యట్లె నీదు మస్థు లీమె తాఁకుటచే నీవు పునర్జీవితుండవైనాఁడవు. తెలిసినదా? లేకున్న నీవీ జయంతిపురంబున కెట్లు రాఁగలవు? చెప్పుము.

జయ — గరితలమిన్నా! నీ విపుడాడిన మాటలు సత్యమేనా?

భాను — సత్యము, సత్యము, ముమ్మాటికి సత్యము.

జయ — అహో! పతివ్రతా శిరోమణీ! మదీయ ప్రాణప్రదాయినీ,

ఉ॥ అమ్మరొ, పేమునందుకొనవమ్మ మదీయ నమస్కృతావళిన్
క్రమ్మఱ నాహితోత్తముని కన్నులపండువుగాఁగఁ జూడ బ్రా
ణమ్ముల నిచ్చినావు; నిను నాయికగాఁ గొనియున్న వీని భా
గ్యమ్ము నుతింప వీల్పడదుగాదె? సతీజనతావతంసమా!

భాను — అయ్యా, నన్నింతగా పొగడెద రెందులకు? తమ ప్రాణదాత ఆయన.

జయ—మిత్రిరత్నమా, (కౌగిలించుకొని) నాఁడు దురభిప్రాయపడి నిన్నుతిట్టి తగిలివేసినను, కోపింపక నన్విడువలేక నావెంటవచ్చి నాదుముష్కులు గంగలోఁ గలుపఁదెచ్చి బ్రతికించిన నీకేమి ప్రత్యుపకారము చేయఁగలను?

జయం—నెచ్చెలీ, ఇకంతయు ఆ నాఁడు మనము కలిసికొనిన వేళావిశేషమే కాని నీతప్పుకాదు. నేను చేసినది నావిధియే గతించినదానిఁగూర్చి మాత్రము నీవు చింతింపకుము.

జయ—నేస్తమా, నీబోఁటి సుద్గుణుఁడు త్రిమూర్తులకైనఁ జిక్కుట దుర్లభంబుగదా! నా యదృష్టమేమందును? అపకారికి నుపకారము చేసి బానిసీనిగాఁ జేసికొనవచ్చునుగదా!

జయం—ఓహో. నన్ను వెక్కిరించుచున్నావా? ఎందుకీస్తోత్రములు? నేను చేసినది నావిధికాని ఉపకారమెంతమాత్రము కాదు. మఱియు, కష్టకాలమున నిన్ను కాపాడలేనందుకు కుందుచున్నాను

జయ—మొదట నోడిపోయినను చివరకు గెలిచినావు. చాలదా! నీవిచారము దూరముగా పారఁదోలవేసి నన్ను చంపుకొని తినినట్లే.

జయం—నన్ను మాటమాటకు పొగడుచుండుటవేని, నన్ను నీవు చంపుకొని తినినట్లే.

జయ—సరే, మానివేసెదను.

జయం—నేనును మానివేసెద. కాంతామణీ! నీ సుగుణాతిశయంబు లేమనికొనియాడుదు?

భాను—ఇది బాగుగానున్నది నన్నెందుకు పొగడెదరు? అయినవంతైనది గదా! మీరావంతుండిపోయినది కాఁబోలు?

జయం—

ఉ॥ ఇంతులమేలుబంతి, నిను హెచ్చుగుకష్టదవాగ్నిఁ ద్రోయ, ఆ
వంతయు ధైర్యలక్ష్మి విడనాడక, పైఁడిపరాకరీతిగా

శాంతముతోడ సైంచి, అలశాంకరి గొల్చి వరంబు దీను
మ్మొంతయు నుద్ధరించి మహీ యశోగుణము గాంచితివహో !

(దేవునుద్దేశించి) పరమేశ్వరా! నీయగణ్యకారుణ్యాతిశయంబున, ప్రాణమిత్రుల మిరువురము విడిపోయి చచ్చి, బ్రతికి కలిసికొంటిమి. ఇంతకంటే మాకుఁ గావలసిన దేమున్నది? అయినను లోకోపకారార్థ మిట్లగుఁగాక !

భరత వాక్యము.

ఉత్సాహ॥ ఓలలాడుచుండ్రుగాక యురుసుఖాబ్ధిఁ బ్రాణిమి
త్రాళి నిరత మడ్డులేక; అఖిలవెల్ల భర్తకా
చాలభక్తిఁ గొలుచుచు న్వశంబుగాఁ దుగాక; సు
శీల శ్రీకరార్థసమితి చెందుఁగాక నిచ్చలున్.

సమాప్తము.



★

గ్రంథకర్త:

కీర్తిశేషులైన మహాకవి

## శ్రీ పానుగంటి విజయ రాఘవరావుగారు

సకల గుణాభిరాముడు లోభి - వడ్డీలకోసం వేదవాక్యాలు సంపద
కోసం సంఘసంస్కారాలు, - అసలీ ఫాయిదాల వసూలుకోసం ఆత్మ
నాశ్యాలు, - కనకంకోసం శునకచేష్టలు, వృద్ధవివాహాలంటే ఉబలాటం -
స్త్రీవిద్యంటే చీదరింపు, పేదవాళ్ళంటే బెదరింపు, కన్న కొడుకంటే
కోఅలుకోఅలు, కన్నబిడ్డలంటే కంటగింపు, ఆశ్రితులంటే యేవగింపు,
నాకర్గని బెదరింపు, అందరిమీదా అనుమానాస్త్రాలు. అతి తెలివితేటలు,
అక్షియోగాలు అన్నీ మూర్తీభవించివున్న నాటకం లోభి. షోకిళ్ళాలంటే
అతని కంటికి చవట పీనుగులు. సనాతనధర్మం బుద్ధికిచవిటి నేల, కరుణారసం
అతనికి కంటకలికం, వితరణ గుణం అతనికి ప్రబలవిరోధి, అనుమానం
అతని సౌమ్యం, అబద్ధాలు అతని ఆత్మ, అసత్య ప్రమాణాలు అతని పంచ
ప్రాణాలు, ఖర్చు అతనికి కంఠపాశం, విద్య అతనికి ఉరిత్రాడు, లోకం
లిన కపకారం చెయ్యాలి. తను లోకానికి అపకారం చెయ్యాలి. అందుకే
అతను అవతరించాడు.

అద్భుత సంఘటనలతో, ఆదర్శసన్నివేశాల్లో ఆనందరసాన్ని ఒలి
కించే సంభాషణలతో, చక్కని వ్యవహారిక భాషలో వ్రాయబడిన సాంఘిక
నాటకం. నాటకప్రదర్శనాలకీ సినిమా చిత్రనిర్మాణానికి అనుగుణ్యమైన
నాటకరాజం. లోభిప్రయత్నాలు ఫలప్రద మౌతాయో, తారుమారౌ
తాయో, ఒకప్రతి కొని వెంటనే చదవండి పానుగంటివారి రచనా సమర్థత
ఈనాటకంలోకూడా ప్రతిభగాంచింది. కొలది ప్రతులు మాత్రమే ముద్రిం
చినాము. త్వరపడుడు!

వెల 1—8—0

## మా స్వంత నాటక ప్రచురణములు

### నాటకరాజములు

ముత్తరాజు సుబ్బారావుగారి

| | | |
|---|---|---|
| ద్రౌపది వస్త్రాపహరణము | .... | 1—8—0 |
| శ్రీకృష్ణ తులాభారము | .... | 1—8—0 |
| రణతిక్కన | .... | 1—0—0 |
| కచదేవయాని | .... | 1—0—0 |
| మార్కండేయ | .... | 1—0—0 |

సోమరాజు రామానుజరావుగారి

| | | |
|---|---|---|
| రంగూన్ రౌడి (పతిభక్తి) | .... | 1—8—0 |
| సతీసక్కుబాయి | .... | 0—12—0 |
| గంగావతరణము | .... | 1—8—0 |
| ధరణికోట (రెడ్లప్రతాపము) | .... | 1—8—0 |
| భీష్మబ్రహ్మచారి | .... | 1—4—0 |
| సతీఅనసూయ | .... | 1—4—0 |
| కాలకేతనము | .... | 1—4—0 |
| బలిబంధనము చం॥ కే॥ | .... | 1—0—0 |

వలయువారికెల్ల వ్రాయవలయును :

కురుకూరి సుబ్బారావు సన్స్.

ప్రొప్రయిటరు :

సరస్వతీ బుక్ డిపో, బెజవాడ.

Printed at P. N. MOORTY PRESS, Bezwada, K. 97. C. 500 - 8-'46.